వ. నాకశబ్దమునకు, న విద్యతే అకం దుఃఖ మత్రేతి నాకః. "స్వ రవ్యయం స్వర్గనాక త్రిదివత్రిదశాలయా" ఇత్యమరః.

గౌరనరాజుచాటుధారిః—

ఉ. ప్రాకటదర్పులై సకలరాయని అక్కన్నపాలు నాజిలో
దాఁకువిరోధిసైన్యము మదం బొదవ న్వరియింప వచ్చుచో
నాకస మెల్లఁ గ్రమ్మిరోను సంచితదివ్యవిమానసంచర
న్నాకవిలాసినీచరణహంసకభూరిఝణంఝణధ్వనుల్. 158

విరాటపర్వమునందు:—

క. మును వెఱతు నేయ మీరలు, నను నేసినఁ గాని యనుడు నాకేశసుతుఁ
ధనురాచార్యుఁడు దెబ్బది, సునిశితబాణముల నేసెఁ జూపఱు వొగడన్. (5-124)

కావ్యాలంకారచూడామణియందు,—

క. నికరవాలము పాలై, నాకంబున కేఁగి రాజి నారాయణ యా
భూకాంతు లెట్టిచనువో, నాకవిటోత్తములఁ దూల నడఁతురు కడిమిన్. (7-66)

వ. నఞ్ సమాసశబ్దము లెన్ని యున్నను అన్నిటికిని ఇటువలెనే అని తెలిసికొనునది.

విశ్వామిత్రశబ్దమునకు రంగనాథునిరామాయణమునందు:—

ద్వి. ఎక్కడా గురుఁడని యెఱుఁగనికన్న నక్కటా గురుఁడు విశ్వామిత్రుఁడయ్యె. 161

రామాయణమునందు:—

మ. హరకోదండవిఖండనుండు జనకక్ష్మాధీశుజామాత భూ
స్కరవంశాగ్రణి జానకీప్రియుఁడు విశ్వామిత్ర యాగాహితా
సురసంహారి విరాధకాలుఁడు ఖరాసుధ్వంసి మారీచసం
హరుఁ డన్యప్రమదాపరాఙ్ముఖుఁ డయోధ్యానాయకుం డాదటన్. (సుం. 263)

ఆపోశనశబ్దమునకుఁ జమత్కారరామాయణమునందు:—

క. ఓశశిముఖి లోపాముద్రేశుఁడు కలశభవుఁ డుండు నిట నతఁడు తపో
రాశి మహాత్ముఁడు మును ప్రాపోశనముగఁ గొనియె సాగరంబులు వెల్లన్. 163

శృంగారనైషధమునందు:—

సీ. గీ. తత్తరమున నాపోశన మెత్తఁబోయి, భూమిసురుం డెత్తు నుత్తరాపోశనంబు. 164

స్వాంతశబ్దమునకు శృంగారనైషధమునందు:—

గీ. అధికశోకపాయితస్వాంతుఁ డైన, నరపతికి విన్నవింపకు నాయనష్ట
హైత్యదోషోదయంబునఁ [1]బరుస నైన, జిహ్వకును బంచదారయుఁ జేదు గాదె.
(2-82)

1 పరుసు.

శాంతిపర్వమునందు:—

ఉ. స్వాంతము [illegible]గర్వ[illegible]సంతమునా[illegible]గాఁగ [illegible]
[illegible]ంతము లేక [illegible] దేహాంత్య[illegible] ము[illegible]నాగమంటు సా
ద్వాంతరసీమఁ జొచ్చి [illegible]
[illegible]ంతముదానహాం [illegible]. (2-331) 166

ఏకాంతశబ్దమునకుఁ [illegible]మునందు:—

ఉ. అంతట నొక్కనాఁడు దనుజాంబుజనేత్రుఁడు వచ్చి పక్షికే
కాంతగృహంబులోన శశికాంతశిలామయవేదిమీఁద నే
కాంతమునందుఁ గొందఱు నృపాలురు నేస్తులు గొల్వ జూద వి
న్యాంతవినోదకేళి మెయి నాడుచు నుండెఁ గన్గుతంబుగాన్. (1-43) 167

ఆదిపర్వమునందు:—

సీ.గీ. కామసుఖసంగములకు నేకాంతగృహము, పాలిచిపాలిచియు ధర్మార్థములకునిదియ
యాస్పదంబన వర్గత్రయానురమ్య, లైనజనుల కెంతయునొప్పు నప్పురంబు. (8-74)

వ. సిద్ధాంత రాద్ధాంత లతాంత ప్రాంత నితాంతాదిశబ్దములు కన్నిటికిని ఇటువలెనే
రెండును నడచును. 169

వ. నారాయణశబ్దమునకు, నారాః-ఆపః అయనం స్థానం యస్య నారాయణః. 'విష్ణు
ర్నారాయణః కృష్ణ' ఇత్యమరః.

ఆదిపర్వమునందు:—

ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు దాను ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁ డీక్షితికష్టుఁడు స్వహో
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగాన్. (1-25) 170

వాతాయనశబ్దమునకుఁ జాముధేష్ణచరిత్రమునందు:—

గీ. అచ్చరలు నందనంబునఁ దెచ్చుకొనుసు, రాగసుమములు హర్మ్యవాతాయనముల
చెంతఁ గాలూఁది తత్పురస్త్రీలకొసఁగి, వేఁడికొనిపోవుదురు కప్రవీడియములు. 171

విరాటపర్వమునందు:—

సీ.పా. తరుణులుఁ బతులువాతాయనమ్ముల నల్లపులయు వేఁబోకలమలయపవను. (2-238)

ఉపాయనశబ్దమునకు సుదక్షిణాపరిణయమునందు:—

చ. నలఁ బడి యున్నజక్కవకవం బురణింపుచు సన్నపైఁటలో
పల బిగియుబ్బుదోయి కనుపంపుపు సేయఁగ మోడ్పుఁజేతు లా

దలను ఘటించి మ్రొక్కిడి పదంపడి మెల్లన డాయఁ బోయి తో
య్యాలి విరిబంతి దోయిట నుపాయన మాయన కిచ్చి యిట్లనున్. 173

అష్టమహిషీకల్యాణమునందు:—

ద్వి. ఇంతులమేల్బంతియిడినసేవంతి, బంతి చేదోయి నుపాయన మిచ్చి. 174

రసాయనశబ్దమునకు ననంతునిఛందమునందు:—

ఆ. నాస్తి యనక మహి ననంతసంపదలు న్నారాయణుం డొసంగు రమ్య మగుర
సాయనంబు బాధల కతఁ డన నిత్యస్వమాసయతులు రెంటి నంటియుండు.(1-21)

జైమినిభారతమునందు:—

సీ. గీ. మట్టిమాత్రంబె పిల్లలమట్టిపేరు, పేరువలెఁగాను శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరువాక్యసరణి, సరసులకు నెల్లఁ గర్ణరసాయనంబు. (1-22)176

రామాయణశబ్దమునకు రాఘవపాండవీయమునందు:—

ఉ. ఏయెడ నర్థగౌరవసమృద్ధియు శబ్దవిశుద్ధియుం [1]దిరం
బై యనవద్యతం బరఁగ నంధ్రవచస్స్థితి భారతంబు రా
మాయణమున్ రచించినమహాత్ముల నాత్మఁ దలంచెద న్జగ
ద్గేయుల నన్నపార్యుని [2]దిక్కన నెఱ్ఱన భాస్కరాఖ్యునిన్. (1-4) 177

జైమినిభారతమునందు:—

తే. మానిజల్పిత మైనరామాయణంబు, స్వరలయగ్రామమూర్ఛనాసరణు లెఱిఁగి
గానశక్తుల మెఱసి సాక్షాత్కరింపఁ, బాడి రాలాపములఁ ద్రిసప్తములు మట్ట. (6-96)

వ. పరాయణ, పలాయన, బాదరాయణ, సాంఖ్యాయన, శాకటాయన, కాత్యాయన,
వాత్స్యాయన, బోధాయన, దక్షిణోత్తరాయణాదిశబ్దములకును ఇటువలెనే రెం
డును గలవు. 179

మార్తాండశబ్దమునకు శృంగారషష్ఠమునందు:—

సీ. గీ. వలనను భయంబు వా రెంతవార లైన, నట్టివారలు మన కగ్గ మైనవారు
వారు నిరయంబునకుఁ గాఁపు నచ్చువార, లనుచు బుద్ధిగఁ జెప్పె మార్తాండసుతుఁడు.

ద్రోణపర్వమునందు:—

మ. ధరణీచక్రము దిర్ధిరం దిరిగె మార్తాండుండు కుంఠీభవ
త్కిరణుం డయ్యె దిశావితానము వడంకె [3]న్మిన్నదర్చె న్మహీ

1 దృఢంబై (ప). 2 దిక్కసుధీమణి నెఱ్ఱసత్కవిన్ (అచ్చుప్రతి). 3 మిన్నె దిర్చెన్ (వా); మిన్ను మ్రోసెన్ (ప).

ధరసంతానము దోఁప గ్రక్కదలి [1]సుద్యత్ప్రాంతంబులై యంబుధుల్
పొరలెన్ గ్రుంగుబడంగ జెట్టుపడుచుల్ [2]మోహోగ్రతన్ సీతాంబధ్వనిన్. (ప-377) 181

వ. బ్రహ్మాండాదిశబ్దములయందు ఇటువలెనే అచ్చును హల్లును జెప్పఁదగును. 182

ఉపసర్గసంధికిఁ జంద్రికాపరిణయమునందు:—

ఉ. అంకిలి దక్కె బాహుబలయుక్తావిపనందన కొనిక్కినాఁడు శు
ద్ధాంతగృహంబు చెల్వడి విహారరతిం జనుదెంచె నచ్చెలుల్
చెంతలఁ గొల్వ గుంజదళికింజితరంజితకుంజమంజుల
ప్రాంతగళత్ఫలాసవరతాంగజఘోటికిఁ బుష్పవాటికిన్. 183

కవిజనాశ్రయమునందు:—

ఉ. మానుగ విశ్రమాక్షరసమంచితమై స్వర మాదినం దవి
యానుగుణాక్షరంబ కొని యైనను జెప్పఁగ నొప్పు నిక్రియన్
భానుసహస్రభాసి వృషభాద్రిపుఁ డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండపడి పొల్పగు నాదికవిప్రణీతమై. (సం.66) 184

వ. ద్వారశబ్దమునకు, ద్వే అరే పార్శ్వే యస్య తత్ ద్వారమ్. 'పృషోదరాదీని యథోపదిష్టమ్' ఇతిసూత్రేణ ద్విశబ్దాంతస్య ఇకారలోపః అకారాదేశః.

ఉ. వారక వారకామినులవత్తలచామరవాతపోహముల్
గోరక కోరకోల్లసితకుంజములం జిగురాకుపానుపుల్
చేరక చేరకేరళకళింగకుళింగనరేంద్రమందిర
ద్వారవిహారులై నిను నందక నందకపాణిఁ గొల్వరో. 185

హల్లులకు నిర్వచనోత్తరరామాయణమునందు,—

ఉ. వారలు వారిధూరిపరివారముతోన విమాన మెక్కి రాఁ
గా రఘునందనుం డరిగి కాంచనతోరణచిత్రమైన త
ద్వారనికాయమైననిజపట్టణ మత్సుకవృత్తిఁ జొచ్చె నిం
డారుమొదంబున న్భరతునాకృతి బాలికవృత్తిఁ గ్రాలఁగాన్. (1-84) 186

## క్యజ్ప్రత్యయాంతములు.

వ. కుమారవదాచరితా శక్తిః కుమారాయితశక్తిః కుమారాయితయా శక్త్యా శాలత ఇతి కుమారాయితశక్తిశాలీ. కుమారసమానపరాక్రమద్యోతవా నిత్యర్థః.

---

1 సుత్కాంతంబులై (ముద్దరాజు రామన్నకవిసంజీవని). 2 మోహ్రపెన్నమో ఘోగ్రతన్; మఱికొన్ని పాఠభేదములును గలవు.

ఆదిపర్వమునందు.—

ఉ. ఆయమ గర్వమా న్విడిచి యన్యపతుల్పని సేయ నిట్లు గాం
గేయభుజాశ్రయంబున నికృత్తవిరోధిసమాజుఁడై కుమా
రాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న
త్యాయతకీర్తితోఁ దనకు హస్తిపురం బది రాజధానిగాన్. (5-6) 187

వ. భద్రవదాచరితా మూర్తి ర్యస్య తత్ భద్రాయితమూర్తిః శోభనమూర్తి మదితి యావత్, అయ మపి క్యఙ్ ప్రత్యయాన్తః.

విరాటపర్వమునందు:—

ఉ. శ్రీ యన గౌరి నాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తి యై హరిహరం బగురూపము దాల్చి "విష్ణురూ
పాయ నమ శ్శివాయ" యని పల్కెడుభక్తజనంబు కైదిక
ధ్యాయిత నిష్ఠఁ బొల్చుపరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. (1-1) 188

వ. ఈరెండుపద్యములయందున్ను నన్నయ తిక్కనగార్లు కుమారభద్రశబ్దములు క్యఙ్ ప్రత్యయాంతములు చేసి సంయుక్తవిశ్రామంబులు గాను బ్రయోగించిరి. అది గనుక గొందఱా రెండుశబ్దములమీఁదను, అకారము లున్నవి నిత్యసమాసవిశ్రాంతు లని భ్రమయుదురు. శబ్దసూత్రమువలన వానికే దీర్ఘములు వచ్చినవి గాని అందులోఁ పల అత్తులు లేవు. 189

## F. దేశ్యనిత్యసమాసవిశ్రాంతులు.

తే. శబ్దశాసనముఖకవీశ్వరకృతప్రబంధములలక్ష్యములఁ గనుపట్టుకతన
దేశ్యనిత్యసమాససంధికిఁ బొసంగు, వడి స్వరంబైన వ్యంజనవర్ణ మైన. 190

క. రూపఱఁ బెంపఱఁ బెల్లఱ, యేపఱచుట గ్రిక్కిఱియుట నిలఁ గ్రచ్చఱయుం
జూపఱి యుక్కఱి మొదలుగ, బ్బాపఱి యివి దేశ్యనిత్యసమసనపదముల్. 191

వ. కొందఱు వీనిపేరే దేశ్యాఖండములును అందురు. 192

అనంతునిఛందమునందు:—(పేజీ. 81)

తే. అఱ యనంగను బోవుట కర్థ మైన, సంధి నిత్యసమాసోక్తి జరుగు రెంట
నసురవీరుల నెల్ల నుక్కఱ వధించె, భానుకులుఁడు రావణుని నేపఱచె ననఁగ.

ఆరణ్యపర్వమునందు:—(౨-౩45)

క. ఎఱకలు గలకుల శైలము, [1]తెఱఁగున మై రయము మెఱయ దివికి నెగసి బి

1. తెఱఁగు మెఱయు నంత వఱకుఁడు.

ట్టఱుము జలధరముక్రియ నుఱ్ఱక్కుఁ దర్పన మెల్ల నద్రువ నార్చుచుఁ గడిమిన్.

యుద్ధకాండమునందు:—

చ. ఎఱిఁగియుఁ జెంగి మున్ను పఁడె రాము గ్గొనరించినదానికై కదా
చెఱఁ గొని వచ్చితిం బెదప సీత వృథాకథ లింక నేల పెం
పఱ బ్రతు కింత తీయనె ఖరాదులచావున కేమి చింత ని
ముఁడు దలిబన్న మేపగిది మానిని యీసున సంధిఁ జేసినన్. (784) 195

వశిష్ఠరామాయణమునందు:—

ఉత్సాహ. మఱియుఁ బెక్కుయోనులందు మహితచిత్రగతులఁ బెం
పఱ జనించి దుఃఖభాజి యై చరించి వెంటయున్
వఱలువిత్రవరుని యింట వాసుదేవుఁ డనఁగఁ దా
నెఱుక గలిగి పుట్టె వేల్పు కెట్టితీరభూములన్. 196

విరాటపర్వమునందు:—

చ. చిఱునగ వొప్ప గాండివము చెచ్చెర సజ్యముఁ జేసి సేన లు
క్కఱ రభసంబుమై నదరఁ గవ్వడి ద్రోణియు నీడువోక య
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు దండడి జాల్కొని మండుచుండెఁ జి
చ్చఱపిడుగు ల్వడిం దొరఁగుచాడ్పున నంబరవీథి నుగ్రమై. (5-148) 197

లక్షణసారసంగ్రహమునందు:—

తే. అచ్చుహల్లును దేశీయమని యొడి వడ్డియొన్న నొక్కొక్కచోట గ్రిక్కిరియెఁగృతుల
సరసలక్షణకవులు గ్రచ్చరనొనర్చు, భంజితానురసముదాయ యాంజనేయ. 198

నిర్వచనోత్తరరామాయణమునందు:—

చ. ఎఱుఁగవు గాక భోగముల కెల్లను నెచ్చెలి జవ్వనంబు ని
త్తఱి నుడి వోవ కుండ నుచితంబుగ జక్కవదోయిఁ బోలి క్రి
క్కిఱిసినచిన్ని చన్నుఁగవ యిం పెసలారఁగ నాదుచిత్తము
న్వఱలుసరోవరంబున నవారణకేళి యొనర్పు కోమలీ. (5-14) 199

ఆరణ్యపర్వమునందు:—

చ. ఎఱిఁగితి నిన్ను నేను విబుధేంద్రుఁడ వీవు జగత్త్రయంబు గ్ర
చ్చఱ భవదీయరక్షణమునంద వెలుంగుచునుండు నట్టిని
న్నఱువుగ నేను వేఁడుకొన నుత్తుఁడఁ గాక మొఱంగి నన్ను న
క్కఱపడి నీవు వేఁడు టిది కర్జమె నిర్జితదైత్య చెప్పుమా. (7-367) 200

ఉద్యోగపర్వమునందు:—

చ. తఱి యగునంతకు న్రిపునకగ్రత నైచ్యము సేసి నీవు నా
కెఱిఁగినయట్లు సేయుము తగం జని యాతనిఁ గాంచి ¹నన్ను నె
త్తెఱఁగున నైనఁ బొందఁగ నుడిం గిలదేనియు నింత యేల క్రూ
ప్పెఱ మునిసర్గవాహనుఁడవై చనుమా మ్మను మంతిఁ దీర్చెదున్. (1–176) 201

ఉ. నన్నయముఖ్యసత్కవిజనంబులకావ్యములందు లేఖకుల్
గొన్నియుఁ బాతకొద్దములు గొన్నియుఁ బోకడఁ బెట్టి తక్కు నై
యున్నెడఁ గాంచి జానపదు లోడక దిద్దినతప్పు త్రోవ నె
ల్లన్నిజ మంచుఁ గైకొనిన లక్షణవేత్తలు సమ్మతింతురే. 202

వ. అది యె ట్లనిన సులక్షణసారంబునందు లింగముగుంటతిమ్మనవ్రాసినయప్రశస్తంబు లగులక్ష్యంబులకు నాశ్చర్యంబు నొంది బహుపుస్తకంబులు నిరీక్షించి వానినెల్లను బ్రక్షిప్తంబులుగా నెఱింగినవాఁడ నై లక్షణవంతంబు లగుపురాతనకవిప్రోక్తంబులు వివరించెద. 203

ఆదిపర్వమునందు:—

క. నావచనమున నపత్యము, గావించును నీకు గొంత కడు నెయ్యమునన్
నీవగచినయాయర్థము, నూవె మనంబునఁ దలంతు సుందరి యెపుడున్. (5–135)

ఉద్యోగపర్వమునందు.—

క. తమతండ్రిభంగి నీకును, సముచితముగ భక్తిఁ జేసి సజ్జనసుతమా
ర్గమునను జరియింపంగా, నమలమతీ కన్నకొడుకుల టరయఁ జనున్. (2–74) 205

ఆనుశాసనికపర్వమునందు.—

క. అతిథి నినుఁ గోరనేనియు, నతిఁ గింకిరిపడక యోలమాస పడక ని
వతనికిఁ బ్రియంబు సలుపుము,సతికిం బతిపనుపు సేయఁ జను నెల్లనియున్. (1–68)

రామాయణమునందు:—

ఉ. అన్నవు తండ్రియట్ల విను మంత్రియ క్కొదటన్యధర్మ రాజ వే
మన్నఁ గొఱంత లేదు మణిహారము లాదిగఁ బెక్కు కానుక
ల్మున్నుగ సీత నిచ్చి జనలోకపతిం గని నమ్మఁ బ్రోవు మీ
పన్నపుకార్యము ల్వలదు సంధియ మే లటు గాక తక్కినన్. (యు. 142) 207

1 నిన్ను (వా. ప).

## 7. రాగమసంధివళులు.

తే. ఆ లనుపదంబు మొదలను రాగమంబు, వచ్చుసంధికి నుభయంబు వళికిఁ జెల్లు
నతివ జవరాలు బాలింతరాలు ముద్దరాలు ధర్మాత్మురా లన రాక్షసారి. 215

మనుచరిత్రమునందు:—

ఉ. ఇంతలు కన్ను లుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించులా
గింతయె కాక నీ వెఱుఁగవే మును వచ్చినత్రోవచొప్పు నీ
కింత భయంబు లే కడుగ నెల్లిద మైతిమె మాట లేటికిన్.(2-41) 216

చారుధేష్ణచరిత్రమునందు:—

క. ఈలలన వేలుపుంజవరాలో యచ్చరయొ కిన్నరవధూమణియో
వ్యాళాంగనయో కాకీ, భూలోకస్త్రీల కిట్టిపొంకము గలదే. 217

## 8. విభాగవళులు.

క. తులసీభూషణ సంఖ్యకుఁ, దెలుఁగునఁ బరిమాణసంజ్ఞ దేటపడుచుప
ట్టుల నేసి యనుపదమునకు, నలరు విభాగవడి యనఁగ నచ్చును వాల్లున్. 218

కాశీఖండమునందు:—(2-104)

తే. అప్పటికి నియ్యకొంటిఁ గా కంబుజాక్షి, ఋషులపాలిటివే యింతలేసిపనులు
కౌతుక కొఁబోతు నాఁబోతుఁగుమ్ములాడ, నడిమియాఁ బెయ్యదెస వచ్చె నాకుఁజూడ.

కావ్యచింతామణియందు:—

ఆ. కృష్ణుఁ డిచ్చు నాలుగేసిచీరలు కూర్మి, నింతులకును నాలుగేసిమణులు
శీవితోడ దోసెడేసిమాడలు కడు, నింపెసంగ గంపెడేసిసొమ్ము. 220

## 9. నామాఖండవిశ్రమములు.

ఆ. అప్ప అయ్య అన్న [1]అర సవ్వ అమ్మక్క, అయి యనుపదంబు లదుకుసంధు
లుభయమునకుఁ జెల్లుచుండు నామాఖండ, వళు లనంగ నూఁదఁబడక సైన. 221

అప్ప యనుటకు నందితిమ్మన చాటుధార:—

క. ఇప్పటిదాతల సరిగాఁ, జెప్పకురా భట్టుకర్ణశిబిఖేచరులన్
జెప్పుము మూర్తిఘనుని వెం, కప్పకు దానమున నిర్భయంబున సభలన్. 222

1 అరుసు (వా).

హాలాశిక్కిఁ భాస్కరునిచాటుధార:—

క. అప్పు లిమ్మనకేలను ఘనుఁడా, యప్పుం గొనఁగి నురలఁ జెంగునాతఁడు రాజా
చెప్పఁగ వశె సాహిణీమా,రప్పను దానమున ఘనుఁడు రాజా నటంచున్. 223

అన్న అనుటకు పొట్టూరిగోపన:—

క. అన్నలుఁడు రూపమున సిరి, యన్న కళాయుక్తి భరతుఁనన్న కరుణచే
నన్నసముద్రపు పెదచిన్నన్నకుమారుండు వెంగళామాత్యుఁ డిలన్. 224

తెనాలి రామలింగము:—

క. చిన్నన్న ద్విపద కెఱుఁగును, బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెఱుఁగు
న్మిన్నంది మొరసె నరసిం, గన్నకవిత్వంబు పద్యగద్యశ్రేణిన్. 225

తేలఁబలుకుటకు విక్రమార్కచరిత్రయందు:—

చ. అనఘుఁడు సింగనార్యునకు నబ్బయ గోపయమంత్రి చిక్కనా
రనయును గల్గి రాత్మజులు రాములు మువ్వురు దోఁచినట్లు పెం
పున వెలయంగ నబ్బయకుఁ బుత్రులు పుట్టిరి రామరాజుఁ గే
సనయును బాచిరాజు గుణసంగుఁడు లింగనయుం గ్రమంబునన్. 226

అయ్య అనుటకు.—

... ... ... ...

కాశీఖండమునందు:—

సీ. గీ. నైషధాదిమహాప్రబంధములు పెక్కు, చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ
యపుడు సెప్పఁదొడంగిన యీప్రబంధ, మంకితము సేయు వీరభద్రయ్యపేర. 227
(1-13)

ఊఁదఁబడక ఉన్నందునకు ననంతునిఛందమునందు:—

తే. ఒరుల నమ్మయ్య యనుచోట నూఁదఁబడక
ద్వివిధ మగుఁ బ్రభునామాంతవిరమణంబు
మహి నయోధ్యకు రాజు రామయ యనంగ
నతని[1]పట్టంపుదేవి సీతమ యనంగ. (1-120) 228

రుక్మాంగదచరిత్రమునందు:—

ద్వి. శ్రీకరగుణసాంద్ర చిరయశోచంద్ర
ఆకారచంద్ర రామయభాస్కరేంద్ర. 229

---

1 పట్నంపు (వా).

అవుఁ అనుటకు ఆంధ్రకవితాపితామహుఁడు:—

క. చేపట్టిన ధూర్తు లగుదురు, కోపించిన రంభఁ గూడుకొందురు జగతిన్
స్థాపింపఁ బోవఁ జాలని, యాపండితులు సాల్వకోన మనసున కెనయే. 230

పలుకులూరి గోపన:—

ఆ. గోలకొండసుబక గోవుల భక్షింపఁ గొండవీటివిప్రకులము నెల్ల
బాచమనుసు చేరి భక్షించుచున్నాఁడు, సుబక మేలా బాచమనుసు మేలా. 231

అవ్వ అనుటకు.—

... ... ... ...

అమ్మయనుటకు ఈచవిపెద్దిరాజురామరాజుచాటుధార:—

క. ఇమ్మహిలో మహిమాన్వితరక్షుల నీసాటి గలరె నానావిధదే
శమ్ముల శ్రీ రామనృసింహమ్మా మా యమ్మ నిత్యహర్షము లిమ్మా. 232

క. ఇమ్మా మదభీష్టంబులు, కొమ్మా మా మ్రొక్కు లెల్ల ఘనముగ నెలో మా
యమ్మా రఘునందనుసీతమ్మా సౌభాగ్యసిద్ధిదాయిని నమ్మా. 233

అక్క యనుటకుఁ జాటుధార:—

క. ఇక్కలియుగశక్తులలో, లెక్కింపను భట్టుకంటె లేక ధరిత్రిన్
మిక్కిలి మల్లేశునియ,క్కకు సరివేల్పు గలదె యవనిస్థలిలోన్. 234

క. చొక్కపు శ్రీగిరినిలయుని, మక్కువ మదిలో నెఱింగి మనుజులఁ బ్రోవన్
దిక్కయి నిల్చినమాయమ్మ,యక్కకు సరిగలదె సకలభాగ్యస్ఫురణన్. 235

అయి యనుటకు పాచపూడి వెంకటయ్యచాటుధార:—

క. వ్యాయామజనితమాయా, పాయమునస్తాపములు నివారణ మగు ద
ప్పాయంబు పూత మగు గం,గాయిని బొడగన్నఁ గాన మాడినమాత్రన్. 236

వణుకూరిగురవ్వరాజు శమంతకమణిచరిత్రమునందు:—

ఉ. కాయవచోమనస్స్థలనకల్పితదోషము లెల్లఁ బాయఁగా
నాయెదలోన నిత్యము సనాతనధర్మముఁ బూని యర్మిలిన్
బాయక కొల్తు రామనరపాలనిరంతరసౌఖ్యదాయి సీ
తాయి సమస్తశోభనవిధాయి [1]మహత్ఫలసిద్ధిదాయిగన్. 237

1 మహాఫలసిద్ధి అని యుండవలెను. లేకున్న 'మహతాం ఫలసిద్ధిః' అని షష్ఠీ సమాసము చేసికొనినయెడఁ దృప్తిఁజెందనగును.

10. ఏకదేశాభిప్రాయము.

ఆ. కర్మయజ్ఞముఁ జేయుమ జెలి యాజనుకన్న, తండ్రి వనుచిఁ గర్త అనఁగసంధి
మొదలఁగఁ గ్రతులఁ బంచనిహావి క్త్రినారాము, మనఁగ వచ్చునటువు మాల్లనవును. 238

చమత్కారరామాయణమునందు:—

క. విష్ణుఁ జెలఁ గొన్న హోమమున్ గన్నన్ గోర్కెన్ వెస్ వనుభార్గవ తి
ల న్నిర్జించినరాముని, కన్నను కారుండు ముజ్జగంబులఁ గలఁడే. 239

ఆదిపర్వమునందు:—

సీ. విపులమఖ ప్రయోగవిదిత్తము లుత్తమధీయుతు లగ
స్నాతకు మహాతపోధను లనుగ్రహానిగ్రహాశక్తియుక్తి లి
క్రతువున ఋత్విజులకు సమానులు పూర్వదిక్పతి
క్రతువున యాజకోత్తములకంటెఁ బ్రసిద్ధులు సర్వవిద్యులన్.(2–227) 240

11. కాకుస్వరవళులు.

క. పలుకులపలఁ గలప్రాలను, వల వగు ప్లుతము నిలిపి వానికి రెండున్
వళులుగఁ జెప్పినఁ గావ్యంబుల నది కాకుస్వరంబుఁ బ్లుతవళియు నగున్. 241

ఆ. ఏకమాత్ర హ్రస్వ మిదుపడించిన దీర్ఘ, మయ్యె మూఁడుమాత్ర లయినఁ బ్లుతము
భీతశోకతర్కగీతదూరాహ్వాన, సంశయార్థములను జరుగుఁ బ్లుతము. 242

భీతిప్లుతమునకు భాస్కరుని రామాయణమునందు:—

ఉ. ఏ జనకాత్మజ న్దశరథేశ్వరుకోడల రాముభార్యఁ బం
ఙ్కోజనులార మొద్దపడరో సురలార సురారి కంచు వం
భోజదళాక్షి శైలవనభూములు దాఁటుచు భీతి నేఁగుచో
నీజలరాశిఁ జూచి మది నెంత దలంకెనొ యేమి సేయునున్. (యు.41) 243

మనుచరిత్రమునందు:—

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోఁట లే
కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ దప్పితిం
గ్రొవ్వున నిన్న గాఁ గ్రమునకుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ జెప్పఁగదవే తెరు వేది శుభంబు నీ కగున్. 244

శోకప్లుతమునకు రామాయణమునందు:—

శా. అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధి నే నజ్ఞాన నై పల్కితి
న్న న్నాపాపము వచ్చి ముట్టుకొనియె న్నాపాలిదైవంబ వై

యిన్నిచుం బరిమార్ప వేగఁ బఱతేవే నన్ను రక్షింపు మీ
యన్నం గ్రక్కునఁ జీరవే యరుగవే యత్యుగ్రశీఘ్రంబునన్. (అర. 2-111)

తర్కప్లుతమునకు హరిశ్చంద్రోపాఖ్యానమునందు.—

శా. ఓరీ రాజకులాధమా నృపులు లేరో వేఁట రారో మద
క్రూరాభీలమృగావళిం దునుమరో ఘోరాటవుల్ లేవో నా
యారామంబు గలంచి జంతుతతి మాయం జేసి యస్మత్కుమా
రీరత్నంబులు వేఁడ వచ్చినను వారి న్నొంచినా వేమిరా. (2-147) 246

శాంతిపర్వమునందు.—

మ. అనుమానింపక తోడఁబుట్టులనె కాదా తున్మి తూఁటాడె నెం
దునుఁ గ్రొన్నెత్తురు లేఱులై పఱవ నిద్ధ్రం దుగ్రతన్ దైత్యులన్
మును లవ్వీరు భజింపరో క్రతువు లామోదంబుతో నమ్మహా
త్మునిఁ జేయింపరొ యూర్ధ్వలోక మది కాదో నాక మూహింపుమా. (1-287)

రంగనాథునిరామాయణమునందు.—

ద్వి. అట్టినామీఁద నీవా యలిగెదవు, పట్టి చెట్టలు వాపి పాఱవై చెదను. 248

ఆనుశాసనికపర్వమునందు.—

ఉ. ఆనరనాయకుం డొకమహాధ్వర మెంతయు వేడ్కఁ జేయఁగాఁ
బూని మహీసురావలికిఁ బూజ యొనర్పఁగఁ దాను బ్రాహ్మణుం
డై నయ మారఁగా ననలుఁ డాతనిపాలికి వచ్చి నాకు నీ
వే నృప నీదుపుత్త్రిఁ గృప యేర్పడ దానముగాఁగ నావుడున్. (1-53) 249

దూరాహ్వానప్లుతము:—

తే. ఆదితేయార్చితాంఘ్రిపద్మా యనంగ, ద్వారకాపురమధ్యపద్మా యనంగ
నసురకులవైరివీరులారా యనంగ, రసికచిత్తాబ్జవాసులారా యనంగ. 250

కళాపూర్ణోదయమునందు:—

మ. అకటా యేమని దూఱుదాన నిను నాథా వేఁగుజా మయ్యెఁ బొం
దికగాఁ బాదము లొత్త రమ్మనుట గానీ యొంటి యేమో కదా
నికటక్షోణికిఁ జేర రమ్మనుట గానీ కొంత నెయ్యంపుపూ
నికతోఁ గన్నుల విచ్చి చూచుటయ కాని లే దొకింతేనియున్. (4-112) 251

సంశయప్లుతము:—

ఆ. మారి యనంగ నాతఁడా నిన్నఁ గంసు నడఁచెఁ గృష్ణుఁ డీతఁడా యశోద
కెంతభాగ్యమబ్బె నీబోటి నాబోటి, నెలఁత కిట్టు గలుగునే తలంప. 252

రామాభ్యుదయమునందు:—

సుగంధి. అంగనాలలామఁ గానవా లతాకుడుంగమా
తుంగమా భుజంగమా పతంగమా కురంగమా
లుంగమా అనంగమాతులుంగమాధవీనట
ద్భృంగమా వనేరమా కటీరమా సమీరమా. (౬-239) 253

విజయసేనమునందు:—

ఉ. నల్లఁభుఁ డెగు దుర్లభుఁడు వానిఁ దెసం దగు లూఁది యిమ్మెయిన్
దల్లడ మందె దేల యుచితస్థితికిన్ నను బాపఁ జూపినన్
దల్లియు బంధులోకమును దండ్రియు నే మనువా రెతెంగిరే
నుల్లమ యిట్లు నీకుఁ దగునో తగదో పరికించి చూడుమా. 254

రామాయణమునందు:—

క. జనకజకు సుమిత్రానందనునకుఁ బ్రణమిల్లి సముచితస్థితి దర్భా
సనమున నుండఁగ రఘుపతి, యనుజన్ముని జూచి సేమమా [1]జనపతికిన్. (అ.258)

12. ప్లుతయుగవిశ్రామములు.

క. తా మేవర్ణము లైనను, క్ష్మామండలమునను బ్రాణమైత్రి గలిగినన్
దామోదర ప్లుతయుగవిశ్రామము లనఁగాఁ బ్లుతాక్షరద్వయ మమరున్. 256

వజ్రపంజరశతకమునందు:—

ఉ. శ్రీగజగామినీమణిని సీతనుగా నిరపాయిఁగాఁ ద్రిలో
కీగృహమేధిఁగా గరుడకేతనుఁగా భవరోగవైద్యుఁగా
నాగురువాన నిన్నె మది నమ్మితి వేఱొకవేల్పుఁ గొల్వ నీ
వే గతి కావవే రఘుపతీ శరణాగతవజ్రపంజరా. 257

ఈపంద్రెండును నుభయవళిభేదంబులు.

ఇంకం బ్రాసయతు లెట్టి వనినః—

ప్రాసయతులు.

గీ. గీతముల సీసములను సంగీతములను, విరతి విడనాడి యొక్కొక్క చరణమునను
రెంటికిని బ్రాసవర్ణంబు నంటఁ బలుకఁ, బ్రాసవిశ్రాంతు లండ్రు కబ్బముల వాని.

ఆ. దేవకీకుమార గోవర్ధనోద్ధార, తోయజాక్ష పాండవేయపక్ష
ఘనవినీలగాత్ర మునిజనస్తుతిపాత్ర, యదుకులాబ్ధిసోమ కదనభీమ. 259

అగ్రాహ్యవిరామంబులు:—

ఆ. వికటకవులు కొన్ని వింతలు గల్పించి, కవిజనాశ్రయమునఁ గలిపినారు

---

1 రాజునకున్.

వానిఁ గైకొనంగ వల దప్రయుక్తంబు, లెల్ల సెప్ప భీముఁ డెఱిఁగియుండెఁ గి. 260

వ. అవి యెయ్వి యనిన. 261

క. వెలయఁ గకారాదులు భూ, వలయమున నైదైదువర్ణములు దామగు నను మత్కా
లలనాపవనుఁడు రేచన, కలితఘననిఘంటు గుణవతంసుఁడు చెప్పెన్. 262

వ. ఈపద్యములోఁ జెప్పినయాఱువర్గములయందును మొదలివర్ణములు నాల్గింటికి వర్గవళ్లు గనుకఁ జెల్లుబడి యవి యన్నియుఁ దాపలఁ బూర్ణబిందువు లేకుండిన నను నాసికములకుం జెల్లవు. అబిందువన్న లున్నట్లైనా బిందుయతులు గనుక నవియు చెల్లును. ఈభేదము చెప్పనందున నీపద్య మగ్రాహ్యము. 263

## అగ్రాహ్యసంబంధవళులు.

క. దడలకు భేదము లెంచక, వడిమూను ప్రాసంబు నిలుప వచ్చును గృతులం
దది యెట్లన్నను శ్రీహరి, దోడిజడి దానవులఁ జంప దుమి యాయె ననన్. 264

వ. ఈ చెప్పినదడలకు పదాదినున్న చతుర్థవర్గసరళము ఆదేశమై వచ్చునప్పుడు ఆదేశయతిగాఁ జెప్పవచ్చును. అదియుఁ గాక ఆరెంటికిని దాపలించి నెఱసున్నలున్నప్పు డనుస్వారసంబంధయతులు గనుక అటువలెను జెప్పవచ్చును. అవి గలుగఁ జెప్పలేదు గనుక నిదియు సమ్మతము గాదు. 265

## అగ్రాహ్యవర్ణచతుష్టయవళులు.

క. యరలవ లనునీనాల్గును, వరుసం దమలోన వళ్లు రయమునఁ జెల్లున్
ధరశషసహావర్ణంబులు, సరవి నొకటి కొకటి చెల్లు హరినిభ రేచా. 266

వ. ఈమొదలను జెప్పినయరలవలకు నాల్గింటికిని చెల్లుబడి గాదు. శషసహాలలోపలను తొలుతటివిమూఁడును ఊష్మవిశ్రాంతులు గనుక చెల్లును. వానికి హకారము చెల్లును. ఇవి తెలియకచెప్పినకతంబున ఇదియు అప్రయుక్తమే ఆయెను. 267

## అగ్రాహ్యభేదవర్గయతులు.

క. ధరఁ బఫబభమాక్షరములు, పరువడి నియొనుగూడ వాతోఁ జెల్లున్
సరి సంభావన వడి యన, మరుదీనము లేమ కీరవాణి యనంగన్. 268

వ. పంచమవర్గాక్షరములైదింటిలోనున్న వబల కభేదయతి గనుకను ప్రథమద్వితీయచతుర్థవర్ణములు వకారమునకు నభేదవర్గయతులు గనుకను అవియు నిలుమను. మకారము నడవదు. ఇది విచారించక చెప్పినాఁడు గనుక నిదియు అబద్ధమని తెలిసికొనునది. 269

వ. ఈచెప్పినమాటలోపలను మొదలం జెప్పినవర్ణలకును సరసపడియును కడను జెప్పిన
లళలకు అభేదవిరతియుఁ గనుక నిరెండును గూర్పవచ్చును. నడుమను జెప్పినరలలకు
"రయోస్తునిత్యంస్యాత్" అని శబ్దశాసనసూత్రముకలిమిం జేసి యేకతరయతు ల
గుటనుం గూర్పరాదు అటుగనుక ఈపద్యమును బ్రశస్తము గాదు. 280
ఇవి నలువదియొక్కటియు యతిభేదంబులు.

ఇంకఁ బ్రాసస్వభావం బెట్టి దనిన.

మూ. సూ:—ద్వితీయో వర్ణః ప్రాసోఽత్రపాదపాదేషు, కించ ప్రాస
స్సర్వేషు సైవ స్యాత్. 22

తే. ప్రథమపాదద్వితీయాక్షరంబు ప్రాస, మద్యో బదపద్యముల నడుగడుగునందు
నదియు రెండవవర్ణ మై యమరు సీస, గీతదండకమంజరీకృతులఁ దక్క. 281

ప్రాసపూర్వాక్షరనిర్ణయము.

క. గురులఘువులలో నెయ్యది, మురహర తొలిచరణమునకు మొదల నిలుచు ని
ద్ధర నాపై నిడుఁ బ్రాసాక్షరములఁ బూర్వమున నదియ కదియింప నగుర్. 282

ఆ. దాసపారిజాత వాసవావరజాత, ఘనఘనాఘనాంగ దనుజగర్వ
భంగ యనుచు నిట్లు ప్రాసాదులను గూర్పవలయు నొక్కభంగి వ్రాలు కృతుల.

ఆ. క్రింద జడ్డలును బిఱుంద బిందువులును, మీఁది ప్రాసములకు నుండెనేని
హ్రస్వ మొకటి నిడుదయక్కరం బొక్కటి, వానిమొదల నిలుప వచ్చు నెందు.

ఆ. పక్షిరాజపత్ర రాక్షసతృణదాత్ర, దంతిభయవిరామ శాంతిధామ
యింద్రనీలమూర్తి సాంద్రపాండురకీర్తి, యనఁగఁ బ్రాసమాత్ర కాదు లొప్పు.

ఆ. వేదవేద్య యసమవృత్తపాదములను, బ్రాసనియమరహితపాదములను
వలసినట్లు మొదలి వ్రాలు సెప్పఁగ నొప్పు, నొక్కదానగురువు నొకట లఘువు.

స్వస్థానార్థసమవృత్తోపజాతివృత్తము.

క్షమాకళత్రుఁడు వనజాతనేత్రుఁడు, గామేపలీశుం డ్రిజగత్ప్రకాశుఁడు
దమాలనీలు న్సముదారశీలుఁడు, హేమాక్షవైరి న్భజియింతు శౌరిఁడు. 287

ఆ. వారిజాతగర్భవామదేవసహస్ర, నయనముఖ్యపుణ్యనామ యనుచుఁ
బ్రాసనియతి లేనిసీసాదిపదముల, మొదల రెండు నిట్లు గదియుచుండు. 288

ప్రాసాక్షరమైత్రి.

తే. ప్రాసముల కెల్లఁ దుల్యాక్షరంబు లైనఁ, జాలు స్వరభేద మైన దోషంబు లేదు
చరణములకడఁ గూర్చుప్రాసముల కెల్ల, నన్నియును సమస్వరంబు లై యమరవలయు.

ఆ. సరసిజాతనేత్ర దురితగుల్మలవిత్ర, హరితనూజమిత్ర గరుడపత్రి
ధారుణీకళత్ర నీరదానితగాత్ర, యనుచుఁ గూర్ప వచ్చు నచ్చు లెల్ల. 290

క. మరితద్విపహార్యాస్త్రా, వరకము చేసుకవిపక్ష నాశీతాస్త్రా
శరధిసుతాలయాన్త్రా, కరినాయకరక్ష హారముఖసురాధ్యాస్త్రా. 291

తే.*వట్రువసుడిన్విత్వముసుగల్వ్యంజనంబు, ప్రాస మైనయుందునదెపఁబెఱప్రాసములకు
వ్యంజనంబు సమాక్షరం బైనఁ జాలు, దానిపై నేస్వరం బైనఁ బూన వచ్చు. 292

ఆ. సకియ పూర్వజన్మసుకృతఫలంబునఁ, గాక యేమి రాజరాక్షసాఖ్యు
నిక్కృపాపమోక్షు దక్కఁగఁ గొనుటయుఁ, దొరసె భోజసుతకుఁ దక్క ననఁగ.

శల్యపర్వమునందు:—

క. చావరు నొవ్వరు పాండవు, లేవురు నని యవ్వు సెప్ప నిప్పలుకులు దుః
ఖావేశకరము లై చేతోవృత్తిఁ గరంచఁ జొచ్చె మద్భరపతింగిన్. (1-14) 294

కవికర్ణరసాయనమునందు:—

మ. అమరీవిభ్రమరీతిలోలనయనాహస్తాబ్జదోర్మూయమా
నమణీదండకచామరాగ్రపవమానాస్పందసాంద్రోళ్లన
క్రమశోభాన్నృపకుంతలప్రకర ముత్కర్షార్హ మయ్యెం దదీ
యమృదుస్పర్శసుఖోన్నతిం బరవశం బై తూఁగుచందంబునన్. (1-64) 295

క. విరమము స్వరప్రధానము, ధరఁ బ్రాసము వ్యంజనప్రధానము నగుటన్
స్వరసంధిఁ జెందునప్పుడును, బ్రకచిరముగ హల్లు దాన ప్రాసము లయ్యెన్. 296

క. అనలు వెట్టిన నిబువకఁ, డా న్నూరక యులికి యాసుదంతిని జేరెన్
దానవసంహారుఁ డే క్రియ, చే నీకఁ జనుచెంచు నాకుఁ జెప్పవె యనఁగన్. 297

## ప్రాసభేదంబులు.

సీ. అర్ధబిందుసమాహ్వయముఁ బూర్ణబిందుఖండాఖండములు సంయుతాక్షరంబు
ధర సంయుతాసంయుతము రేఫయుతలఘుద్విత్వవికల్పముల్ వెస నుభయము
ననునాసికప్రాసమును బ్రాసమైత్రియుఁ బ్రాసవైరంబు స్వవర్గజంబు
ఋప్రాసలఘుయకారప్రాసములు నభేదంబును సంధిగతంబు ననఁగ

తే. బదియు నేడు దెఱంగులఁ బరిఢవిల్లుఁ, బ్రాసములు పూర్వసుకవిప్రబంధములను
గ్రమత లక్షణలక్ష్యయుక్తంబు గాఁగ, జేటపఱిచెద వాని నిక్కాటదమన. 298

## సమప్రాసములు.

తే. పూర్వమున నర్ధమైనను బూర్ణమైన, దిగువ జడ్డక్కరం బైనఁ దగిలి మొదలి
ప్రాస మూండినయెడ సమప్రాస మనఁగఁ, బిదప నన్నియు నట్లనె గదియవలయు.

---

* సైత్వము (ప. వా).

1. సనుప్రాసములం దర్ధబిందుప్రాసము.

ఆ. వీరకం బఖ్త్వముఖుని దాఁకి కోసలవల్ల ఘనుఁను బలాసురాంతకుఁడు నెలంగ
నవనిఁ గూర్చె ననుట నర్ధబిందుప్రాస, మిట్టి గూర్పు వలయు నెల్లకడల. 300

* 2. పూర్ణబిందుప్రాసము.

క. పొందెడు వలయు నెక్కెడ బృందావనచారి పూర్ణబిందుప్రాసం
బిందీవరాక్షి భీష్మక, నందన చేకొనియె నందనందనుఁ డనఁగన్.

+ 3. ఖండాఖండప్రాసములు.

క. నిడుపులు నరసున్నలు నగు, కొడుకులు గొనక పటుప్రాసల కెలఁ బ్రాసము లై
దొడరుచు నిర్బంధమువు లొక్కెడ ఖండాఖండప్రాససంజ్ఞ నివర శివముగా. 302

ఆదిపర్వమునందు:—

క. వీరక [1]బలు తెంచునిరుగడఁ, దాఁకినఁ గను వలిగి ఘోరతరశరహతి న
మ్మూకలు విరియఁగ నర్జునుఁ, [2]డాఁకొరిపుల నేసె నుగ్రుఁ డై రణభూమిన్. (3-303)

విరాటపర్వమునందు:—

క. నాకొఱకు దీర్చి వచ్చితి, [3]నీకొఱకు యింక నూతుని నైగఁ జూడ
న్నోకము వంచింపఁగఁ దగు, నీకటమి మొనగె నెట్టి చేయుదొ చెపుమా. (2-271)

ద్రోణపర్వమునందు:—

*సీ. పా. మూకలుపడిరియించి వీఁకనాచార్యాదిమోహనులకెల్లను నొక్క చెసను. (2-126)

రుక్మాంగదచరిత్రమునందు:—

ఉ. ఓకరుణాకలాప వికచోత్పలలోచన యిప్పు డియ్యెడన్
గాకులు చంప కుండ నను గైకొని కాచినయక్కపాపుణం
బే కలిగె న్వసింపఁ దగునే తొలిపుట్టువునందు భర్తపైఁ
గాఁకలు సేసినట్టినువకల్మషము ల్విన నినుఁ జెప్పెదన్. (4-99) 306

ఆదిపర్వమునందు:—

మత్త. తీఁగ యమ్యొల నూఁచఁ జల్లనితియ్యమామిడిమోకలం
డాఁగుఁ బువ్వులతేనెసోనలఁ దాఁటి గేతకిఁ జేరఁ బు

1 బలు తెంచినల్లడ (ప్రా. ము). 2 డాఁకతమున (ప. వా. పె). 3 నీకొఱ వయ (వా. ప). * మూకశబ్దము శబ్దరత్నాకరములో సార్ధానుస్వారముగఁ జేర్చి యీసీసపాదము నే యుదాహరించినాఁడు; కాని యప్పకవిమతమున సార్ధానుస్వారము గాదు.

రిత్రముఁ దప్పకుండఁగఁ బరీక్షితుఁ గాచినయట్లు రామమాం
ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబునన్. (ఆ. 2-178) 316

వ. మాంధాతృశబ్దము ఋకారాంతము గనుకఁ దకారముక్రింద నున్నది వట్రువ
సుడిగాని క్రారవడి కాదు. అంగులకు. 317

కవికర్ణరసాయనమునందు:—

సీ.గీ. దానగుణశాలి భూసముద్ధరణదక్షుఁ
డనిశమఘదీక్షితుండు మత్తారిహారి
విఖ్యాతినిరతుఁడు యువనాశ్వవిభుసుతుండు
ఘనుఁడు మాంధాత నృపుఁడైన కాలమునను. (2-58) 318

సోమువిహారివంశమునందు:—

శా. నాతో మార్కొన లేరు నిర్జరపురీనాథేంద్రబృందారకా
రాతుల్మున్నగ దేవసంఘములు పోరన్ధీరసంగ్రామకుం
డీత్రైలోక్యమునందుఁ గల్గఁడు రణం బెచ్చోట లేకుండఁ గాఁ
జేతుల్వ్రేయు వృథాభరం బగుచు వచ్చెన్దైవ యీమేనికిన్. 319

దేవీవిజయమునందు:—

తే. వాక్త్రిణేత్రాంగనాశచీశక్తు లధిక
సంభ్రమంబునఁ గుంభనికుంభదైత్య
హంత్రిఁ బూజింపుదురు త్రయీమంత్రములను
స్తోత్రములు చేసి మంగళారాత్రిక లిడి. 320

పద్మపురాణమునందు:—

క. శ్రీకరచక్రాంకితు లగు, లోకులు శుద్ధులును బుణ్యులును నగుదురు వా
రీక్రియలు లేక యుండిన, బ్రాకృతు లనఁ బతితు లనఁగఁబడుదురు జగతిన్. 321

లకారశ్లిష్టమునకు రాఘవపాండవీయమున:—

శా. లోకత్రాణరతిం దదాదిమమహీలోకప్రవేశోత్కభా
షా*క్లప్తప్రథమద్వితీయపదగుంజన్మంజుమంజీరగ
ర్జాకల్పామలరామభారతకథాసర్గంబుల న్మించువా
ల్మీకివ్యాసులఁ గొల్చెదం దదుభయశ్లేషార్థసంసిద్ధికిన్. (పీఠిక. 3) 322

## 6 రేఫయుతప్రాసము.

ఆ. సుడులు తెలుగులందుఁ బొడమ వాకైవడి, వ్రాలుకొమ్ము క్రారవడులు గాన

* 'క్లప్త' లో 'క్ల' లకారశ్లిష్టము గాదు. అప్పకవి యీపద్యమును లకార శ్లిష్టమున కుదాహరణముగ నిచ్చుట ప్రమాదము.

రేఫయుతసమాఖ్యఁ గృతులఁ బ్రాసము లగు, నాదిఁ దమకుఁ దాము సుడులఁ బాసి.

క. సంగ్రామరంగమునఁ బెల్లుచం గుప్పు మ్మంచున్న సాల్వజగతీపరుమే
నం గుప్పించిపార నాటించెం గ్రూరాస్త్రములు నాల్గు శ్రీకృష్ణుఁ డొగిన్. 324

క. ఈకాఁపుర పలుకునకు మొదలై క్రాలుచుఁ జెలిపారెస మగుఁ దనతనకే
శ్రీక్రొమ్ముడిసౌందర్యము, వాక్ప్రావ్యం బరమె యొఱగవడునకు నైనన్. 325

లఘుద్విత్వప్రాసము.

తే. భువి లఘుద్విత్వసంజ్ఞికంబు లయి కొన్ని
యూఁదఁ బడనికాఁపురలతోడ నొకటి కొకటి
ప్రాసముల కగుఁ దమలోనఁ బత్త్రయుగము
విద్రుచె వినతాత్మజుఁడు దిక్కు లద్రువ ననఁగ. 326

వికల్పప్రాసములు.

తే. పంచవర్గంబులను గనుపట్టునట్టి
పొల్లు లనునాసికాక్షరంబులను గదిసి
తమదుపంచమములుఁ ద్రుతీయములు నగుచు
నమరుఁ బ్రాసంబులకు వికల్పాన్వయముల. 327

తే. ప్రాజ్ఞనగసమానధృతి సుధారుఙ్నిభాస్యు, ప్రజ్ఞచయసక్తకంత దావాగ్నిపాయి
వాఙ్మనోహారసుత యసద్భృఙ్మహాత్ము, దిఙ్మహితకీర్తి యర్జునయుఙ్మభేది. 328

ఉభయప్రాసము.

ఆ. ధాత్రిఁ బాణినీయమాత్రములను ద్రుతియోష్మమును ద్రుతంబు నొక్కచోటఁ
గ్రమత షాక్షరము ణకారము నై ప్రాసములకు నుభయసంజ్ఞఁ బొసఁగు రెండు.

త్రైశంకవోపాఖ్యానమునందు:—

క. ఝష కేతుద్విషునకుఁ గిల్బిషపర్వతవృషున కమృతవిషనిధిజామా
త్రిషునకు ఋషిపూజితునకు, విషమాక్షున కింద్రముఖదివిజపక్షునకున్. 330

సాంబవిలాసమునందు:—

క. వసుధాకళత్రునకు స్మారసదళనేత్రునకు మరుదరాతిమదతమో
విసరాంబుజమిత్రునకు, న్విషమశిలీముఖసహస్రనిభగాత్రునకున్. 331

తే. ప్రాణములఁ బాపె నావావతక్షోణియందుఁ, బ్రాణవల్లభఁ గొని చన్న దానవేంద్రుఁ
దమ్ముఁడును దాను గీశజాతమ్ముతోడ, శరధి బంధించి దాఁటె దాశరథి యనఁగ.

ఉద్యోగపర్వమునందు:—

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులుం
బ్రాణము లాసురోధనునిపాలిట యుంచి సహానుజన్ము ల
క్షీణపరాక్రము ల్సుతు లజేయులు బాహ్లికసోమదత్తు లా
స్థాణున కైన నోడరు వశంబె జయింపఁగ వారి నేరికిన్. (1-299) 333

కాళహస్తిమాహాత్మ్యమునందు:—

మ. ప్రణుతశ్రేయముఁ గాంచెఁ గుంభజుఁడు లోపాముద్రతోఁ గూడి ద
క్షిణకైలాసము నంబికాహరకృతశ్రీపాదుకాన్యాసమున్
మణిమంత్రౌషధవాసమున్ భవమహామాయావిపర్యాసమున్
గణనాతీతనటీవిలాసమును సమగ్రశ్రీసముల్లాసమున్. (1-109) 334

కాశీఖండమునందు:—

క. †త్రిణయనునిరాణివాసము, నణిమాద్యైశ్వర్యవితరణామరతరువున్
మణికర్ణిక ము త్రిపథ్యా, మణికర్ణికఁ దలఁచె నాని మానసవీథిన్. (2-160) 335

రామాయణమునందు:—

చ. రణమున నుగ్రసాయకపరంపర భానుకులం బరాముల
త్మణము జగం బవానరముగా విలునేర్పున మద్భుజావిజృం
భణమును జూపి తండ్రి మదిఁ బట్టినచింత దొలంగఁ బెట్టి శూ
ర్పణఖకు నిట్లు వాటిలినబన్నము నీఁగుదు నే నవశ్యమున్. (యు. 544) 336

మధుసేవనమునందు:—

క. పో సుద్యోగముఁ జేసిన, ప్రాణంబా యింక నీకుఁ బాథేయం బీ
మానినిమందస్మితమధు, రాననచంద్రికలు గ్రోలి యరుగుము పిదపన్. 337

శృంగారనైషధమునందు:—

క. అనుటయుఁ గృష్ణద్వైపాయనతనయుం డిట్టులనియె నవహితమతి రై
విను మతిగుహ్యము నారాయణకవచము భక్తవాంఛితార్థప్రదమున్. 338

ఆరణ్యపర్వమునందు:—

చ. కనకగిరిం బ్రదక్షిణముగా శశిభాస్కరతారకాగణం
బనవరతంబు ద్రిమ్మఱు మహామునిసప్తకమండలంబుతో

---

†ఇచ్చట ణత్వము కాదు; కాని శ్రీనాథుఁడు ప్రయోగించినందున సాధుత్వము కల్పనీయము. లేక సామాన్యముగ నణలకుఁ బ్రాసమైనను ఒప్పవలెనని చెప్పవచ్చును.

ననఘ తదీయశైలశిఖరాగ్రమునం బరమొందవలసిన
*త్రిణయనవిష్ణు లుండుదురు దేవగణంబులు గొల్చుచుండఁగన్. (4-36) 339

10 అనునాసిక ప్రాసము.

తే. తమకుఁ దామ ద్విత్వంబు లై తనరువర్గముఁ
బూర్ణబిందులు దాపలఁ బొరయునవియుఁ
గలసి యనునాసిక ప్రాసము అను పేర
నమ లమరుఁ గావ్యములయందు దమకుఁ దామ. 340

క. మిన్నేఱు పాదమున ధ్యాత్మ స్నాభిని గనుమకరరు సెదం గాంచినని
సాన్నిధ్యము దొరకుటకై, సన్నుతి సేయుదము నిన్ను సనకాదు లజా. 341

క. తమ్ములను మల్లికాకుసు,మమ్ముల మరువాదిపత్త్రమాలికలను భ
క్తిం మురసంహారుపూజలు, సమ్మదమున సలుపఁ గలుగు సకలార్థంబుల్. 342

11 ప్రాసమైత్రి ప్రాసము

తే. గట్టిబిందువుమీఁది బకారమునకు, జమిలిమా ప్రాసమైత్రి నా జరుగుచుండుఁ
గమ్మతావులు వెదచల్లునంబుజములు, శంబరారాతిచేతివాలమ్ము లనఁగ. 343

12 ప్రాసవైరము.

తే. కబ్బములు రేఫమునకు ఱకారమునకు, మైత్రి గలుగమిఁ గవిశిఖామణులు ప్రాస
వైర మనుచును గలపరు వాని నెందుఁ, గూర్తు రారెండు నెఱుఁగక కుకవిజనులు.

13 స్వవర్గజప్రాసము.

తే. గ్రంథమంథశబ్దంబులఁ గలద్వితీయ, వర్ణములు రెండును సఘోషవర్ణము లగు
నైన నిజవర్గభవచతుర్థాక్షరములఁ, గలియుఁ బ్రాసంబులను స్వవర్గజము లనఁగ. 345

వ. 'గ్రంథగ్రంథసందర్భే' యనుధాతువులవలను 'శాస్త్రద్రవిణయో ర్గ్రంథః' అని నామలింగానుశాసనమునందు నానార్థవర్గములోపలను దవర్గద్వితీయాంతములయందే అమరసింహుఁడు చెప్పుటచేతను గ్రంథిశబ్దము తనయందు రెండవ్రాయి తవర్గమునందు ద్వితీయాక్షర మైనఁగాని ప్రాసములయందు చతుర్థాక్షరములకు మహాకవిప్రయోగములు గలుగుటవలను చెల్లును. 346

అరణ్యపర్వమునందు :—

ఉ. అంధకవృష్ణిభోజకురాన్వయభూపతు లెల్ల నీవెసఁ
బాంధవసౌహృదప్రణయభక్తివిశేషము లొప్ప నీమనో

*ఇచ్చట ణత్వప్రాప్తి కవకాశములేదు; కాని ప్రాఁతప్రతులయందు ణత్వమే కనఁబడుచున్నది.

గ్రంథి యపాంగఁ జేయుచు ననంబుఁ బూనినవారు లోభమో
హాంధులు ధార్తరాష్ట్రులు నయమ్ము వినియు న్నన కుర్వి యిత్తురే. (అ. 4-160) 347

విరాటపర్వమునందు.—

ఉ. బాంధవకాత్రవా కలితభావభవా ధనపాశబంధనం
బంధవిరామకామపరిపక్వవివేకనిరూఢభక్తహృ
ద్గ్రంథివిభేదనా పరమకారుణికా పరిమాణదూర దుః
ఖేంధనపావకాయితసమీక్షణ[1]చైత్యమహాద్భుతాత్మకా. (1-333) 348

వ. మంథ విలోడనే యనుధాతువు వికల్పమునఁ దవర్గద్వితీయాంతధాతువు
లలోను బరిగణితమైనది గనుక మంథశబ్దములోని రెండవవ్రాయి తవర్గమునందు
ద్వితీయాక్షరమైనను బ్రాసములపట్లను బూర్వకవిప్రయోగములు గలుగుటచేతను
చతుర్థవర్ణములకుఁ జెప్పవచ్చును. 349

ద్రోణపర్వమునందు.—

క. సింధురము. మదోద్రేకమ్మునఁ దాంధంబై వచ్చునోజ నాచార్యునిపై
గంధవహసుతుఁడు [2]గవయుఁగ మ్మంథరగతి నెవ్వఁ డాఁగు మనయోధులలోన్.
(1-88)

ఆముక్తమాల్యదయందు.—

ఉ. కంధరనీలవర్ణ మధుకైటభనాగసుపర్ణ యోగిహృ
ద్గ్రంథిభిదోర్ధ్వభోగిశయనా తనుసచ్ఛ్వసనప్రవచ్ఛిర
స్సింధువసన్నిశాపతిరసస్రుతిమగ్నపయోధివీచికా
మంథరకేళికాధర సమాశ్రితపద్మ—శిరోధిసోదరా. (5-158) 351

వ. బుధ అవగమనే అనుధాతువువలనను బుధశబ్దములోని రెండవవ్రాయి తవర్గమునందు
చతుర్థాక్షరమైనను బ్రాసములపట్లను బూర్వకవిప్రయోగములు కలుగుటచేతను
దృతీయవర్ణమునకుఁ జెప్ప వచ్చును సుధాశబ్దము మొదలైనవానికిని ఇటువలెనే
యని తెలిసికొనునది. 352

ఆదిపర్వమునందు.—

ఉ. కాదన కిట్టిపాటియపకారము తక్షకుఁ డేకవిప్రసం
బోధనఁ జేసి చేసె నృపపుంగవ నీవు ననేకభూసురా
పాదితసర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికా
కోదరసంహతిన్ హుతవహోగ్రమహోగ్రశిఖాచయంబులన్. (2-200) 353

---

1 జైత్య (అచ్చు. ఛా). 2 గవయన, మంథరగతి (వా. ప).

గ్గీ యిది చాలఁ గ్రొత్త యని యుంకొకరూ తెలికకొక్కరూ కుటం
చాయుఖలవేణి నలకాధిపసూనుఁడు చేఁడె వేఁడినన్. (1-93) 362

16 అభేదప్రాసము.

తే. వేసములు పంచబాణుమాతృకలు పెట్టి లాయభేదాహ్వయప్రాస మై యొసంగు
ఖలజనవిపక్ష జలరుహదళనిభాక్ష, కాళియోరగమదదమనకేళి యనఁగ. 363

రాజశేఖరునిచరిత్రమునందు:—

శా. కేళీకాంచనసౌధవీధికల చక్కిన్ గొట్టికల్ పెట్టి యో
ప్రాలేయాచలకన్యకాధవుఁ కృపాపాంగతా నిద్ర వో
వే లావణ్యపయోనిధీ యనుచు నావిఖ్యాతమోదంబుతో
జోలల్పాడును రక్కుమారకునకున్ శుద్ధాంతకాంతామణుల్. (2-4) 364

రామాభ్యుదయమునందు:—

ఉ. పాలును నిరు నేఉంపఱుపం గలనూత్నల వేదవీధి వా
హ్యాళి యొనర్చు నేమలికులాలక తా నిరన్న యయ్యె నే
బాల సువర్ణదేహమున భాసిలు నానలు మోమువేల్పుప్రో
యాలు ప్రవీణ మామకమహాకృతినాథుఁ గృతార్థుఁ జేయుతన్. (1-8) 365

తే. పెద్దలాకున దన్నఁ నభేద మగుటం, బళలకు నభేద మట్లను గలుగుకతన
క్షితిని మూఁడవసరళంబు యతులఁ బ్రాసములను లఘ్వలఘులకారములకు నిలుచు.

ప్రభావతీప్రద్యుమ్నమునందు:—

క. జలనిధి యను తెరమఱుఁ గటు, వెడలి నిలిచినట్టియాటవెలఁదియపోలెన్
గడు నింపులు గులుకుచుఁ దన, కెడు విపురలక్ష్మి యనధరించితె యధిపా. (1-57)

ఉద్యోగపర్వమునందు:—(1-...)

క. కొడుకులు దానును గుఱ్ఱపు, దళములు కరిఘటలు భటరథవ్రాతములుం
బుడమి చలింపఁగ ద్రుపదుఁడు, గడు వేడుకఁ దోడు నూపెఁ గౌంతేయులకున్.

భీష్మపర్వము:—

క. కొడుకులు దమ్ములు గుఱ్ఱఁపు, దళములు పెక్కైనబలవితానము తగుపైం
నడపింపుచు మెలపున సం,గడములతో నడుచుశకుని కడు నొప్పారెన్. (1-93)

శృంగారనైషధమునందు:—

చ. చిలుకలు గూయునో చెవులు సిల్లులు వోవఁగ నంచు నెన్నఁడు
న్వెడలఁడు నందనోపవనవీథుల కై యట పాళి భాగని

ర్మలశశిరేఖ చేయునపరాధమునన్ గజదైత్యశాసనుం
గొలువఁడు పాకశాసనుఁడు కోమలి నీవెసఁ గూర్మి యెట్టిదో. (4-24) 370

కూర్మపురాణమునందు:—

తోటకము. తొలిమి దూలినతాపసపత్నులన్, వీడ్వడమునంబున వీడ్కొని జాలిన్
లోలమదాలసలోచనపఙ్క్తిన్, జాలఁ దలిర్చిరి శంకరులీలన్. 371

సంధిగతప్రాసము.

తే. సంధిఁ గూడినవ్రాలు ప్రాసంబు లైన, నవియె సంధిగతాఖ్యల నమరుచుండు
దివిజు లాశ్చర్య మొంద శౌరి వడమైచెఁ, జెంగి పోనికమధురలోనం గరి నన. 372

శల్యపర్వమునందు:—

క. కవదొనలును గాండీవము, నవల నిడం బనుపు ముంద రరదము డిగు మే
న్వ విదప డిగిరొద శుభకర, మవు నివ్విధ మిట్లు సేయు మనుడు నతండున్.(2-334)

~~కళాపూర్ణోదయమునందు:—~~

శా. ఆవాలుంగనుదోయి యానగు మొగం బాగుబ్బపాలిండ్ల పెం
పా వేణీభర మాతనూవిలసనం బాయొప్పు లేఁ జెప్పినం
గైవారం బగుఁ గాదె కేవలశిరఃకంపంబు గల్పించి యా
హా వుట్టింపదె యిక్షుధన్వునకు నయ్యబ్జాక్షి వీక్షించినన్. 374

విరాటపర్వమునందు:—

శా. సింగం బాఁకటితో గుహాంతరమునన్ జేడ్పాటుపై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.(4-95) 375

లకారప్రాసము, ~~కాశీఖండమునందు~~.—

శా. మారుం డద్భుతశంఖ మొక్కటిని సంపాదించి దోర్మధ్యక
మారీచర్చ నెపంబునం దనదుకే ల్లోపన్ సువర్ణత్వశే
ఖాలిప్సన్ శశికైత్రికూప నతఁ డుత్కంఠతోఁ డైచేర నిం
పారన్ బట్టుట దోఁచెఁ దద్గళము కేశౌఘంబు మోమూం గనన్. (7-10) 376

వ. ఈపద్యములోను 'రేఖాలిప్సన్' అన్నచోటను రభరాభస్యే యనుధాతువువలనఁ
బుట్టినది లిప్సాశబ్దము గనుక సంధిగతప్రాసమాయెను. 377

అప్రశస్తప్రాసము.

ఆ. అప్రశస్తము లగు ప్రాసజాలము లలం, కారవిస్మృతములు గావు గానఁ

దివిరి ధూర్తులైనకవులు కల్పనఁ జేసి యొప్పినంబు లనుచుఁ జెప్పరాదు. 378

వీథినాటకమునందు:—

ఉ. కందుకకేళి సల్పెడు ప్రకారమునం బ్రసవాయుత ప్రియా
తాండవకేళి సల్పెడువిధంబునఁ బాళికభామ లేఁతని
రెండఁ బ్రభాతవేళ రచియించెను గుబ్బలవ్రేఁడిహారమాల్
కుండలము ల్కరుల్గవల గోమయపిండము లంటిముంచపటన్. 379

రామాయణమునందు:—

చ. కడుకొని వేడిబాష్పములు గ్రమ్మి పయిం బడి పర్వ భీతితో
నడరుచు విన్న నైనహృదయంబునఁ బొల్పుగహారయష్టి ప
య్యెద దడియంగఁ గానఁబడి యంచితనిర్మలరత్నభూషలన్
దమదితదృశ్యమానమణిధామసమాజ్జ్వలభాతి దోఁపగన్. 380

ఇవి పదియేను బ్రభాతప్రాసంబులు.

ఇంక శబ్దాలంకారంబు లగుని శేషప్రాసంబు లెఱింగించెద:—

సీ. ప్రాసంబు సులభాక్షరం బైన సుకరంబు దుర్లభం బైనను దుష్కరంబు
తగ రెండుమూఁడునాలుగువర్ణములపదంబుల నెల్ల నొకభంగిఁ బొసఁగెనేని
వరుసఁ గావ్యముల ద్వంద్వప్రాసమును ద్వ్యక్షరప్రాసము నుజతుఃప్రాసము నగుఁ
బదములఁ దుది నొక్కపగిదియక్షరములు దనరు నంత్యప్రాసమునకు నెందు

తే. బడిఁబడిని వర్ణ మొక్కఁడుకడను వెడలఁబలుకఁబడు నేని యాది యనుప్రాసమయ్యెఁ
గంజలోచన యవి యలంకారశాస్త్రకథితములు వీని నేడింటిఁ గానవలయు. 381

సుకరప్రాసము.

క. కమలదళనయన సకలా, గమవేద్య పురాణపురుష కరుణాకర మ
ద్రమహీశ ప్రియతనయా, రమణ యనుచుఁ బలుకఁగసుకరప్రాస మగున్. 382

దుష్కరప్రాసము.

క. దుష్కృతగిరివజ్రాయుధ, పుష్కరసదనాధినాథ బుధనుత దపశో
చిష్కేశాహార యనన్, దుష్కర మని దీనిఁ బలుకుదురు ప్రాసజ్ఞుల్. 383

ద్వంద్వప్రాసము.

క. వ్యాసమునివినుత గోప, స్త్రీసముదయమానహారణ శృంగారరసా
వాసమగ నిట్లు ద్వంద్వ, ప్రాసము కావ్యములఁ జెప్పఁబడు నెల్లెడలన్. 384

త్ర్యక్షరప్రాసము.

క. తిర మగుఁ ద్రిప్రాసము సుందర మగుమూరవైరిరూపు తరుణులకు మనో

హార్ద మగు దానవ్రాతకు భీకర మగుఁ దపసులకు మాత్రికర మగు ననఘా. 385

చతుఃప్రాసము.

క. ధీరుఁడు కమలాముఖభా, కారుఁడు కమలాపభూతికామ్యదుష్ప్రాదయా
ధారుఁడు కుమతిజనాధిక, మారుఁడు కమలాక్షుఁ డనఁ జతుఃప్రాసమజా. 386

అంత్యప్రాసము.

క. తొలుతను గురులఘువులతోఁ, బల నెవ్వాది పదముతుదిని ప్రాసమునకుఁ దాఁ
బల నిచ్చు నదియె నాల్గవు, గులకుఁ బ్రాసముల మొదలఁ గూర్పఁగవలయుఁగా. 387

తే. అంఘ్రితుదిప్రాయి దాఁపలియక్షరంబు
గురు వయినఁ బ్రాస మొక్కయక్కరము యగును
గాక లఘు వైన వర్ణయుగ్మంబు నడుచు
స్వరవిభేదంబు గాక కావ్యంబులందు. 388

క. నందాంగనాకుమారా, మందరగిరిధీర దనుజమదసంహారా
బృందావనవిహారా, కందర్పాకార రాధికాస్త్రీజారా. 389

క. గోపవధూజనమదనా, గోపాలచతుర కుందకుట్మలరదనా
గోపారివిజితకదనా, గోపతివాహాస్త ధవళగోసమువదనా. 390

అనుప్రాసము.

క. నందసుత పురందరముఖ, బృందారకవంద్య దాసబృందావన గో
విందా యన ననుప్రాసం, బందం బగు నెంతయుఁ గృతులయందు ముకుందా. 391

క. పదులకుఁ బ్రాసంబులకును, విదువక చెల్లుబడు లెల్ల వివరించితిఁ బా
ల్పడి వీనిలోన సత్కృవు, లాడఁబడి కావలసినవి ప్రయోగింపఁ దగుఁగా. 392

మత్తేభవృత్తకందగీతగర్భసీసము.

సీ. వినయసంపన్నరవిప్రభూతరమణీనాథా పయోజేక్షణా నరాప్త
విభయదాకారహావిఘ్నగాయతరిపుప్రాణానిలాహీశ్వరా రమేశ
విలయకాలానలవిక్రమప్రథతసాల్వగ్రావవృద్ధశ్రవా వరేణ్య
విజయశీలా యదువీర కౌస్తుభధరా చక్రీ యశోదాత్మజా ముకుంద

తే. కరివరద పూతనాంతక గరుడగమన, సత్త్వసహిత కామజనక శంకరసఖ
కనకవసనసుందరదేహా వనధిశయన, సనకమునివినుతచరణసరసిజయుగ. 393

గర్భమత్తేభము.

నయసంపన్నరవిప్రభూతరమణీనాథా పయోజేక్షణా
భయదాకారహావిఘ్నగాయతరిపుప్రాణానిలాహీశ్వరా

జయకాలానలవిక్రమప్రథితసాల్వగాత్రవిపృథక్రవా
జయశీలా యదువీర కౌస్తుభధరా చక్రీ యశోదాత్మజా. 394

గర్భకందము.

కరివరద పూతనాంతక, గరుడగమన సత్త్వసహిత కామజనక శం
కరసఖ కనకవసనసుం,దరదేహా వనధిశయన సనకమునిస్తుతా. 395

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజసగోత్ర కామెపల్లిపురమందిరనందనందనచరణారవిందవందనాభిలాష మనీషాప్రాభవవేంగనార్యతనూభవ విద్యావిశేషసురాచార్య కాకునూర్యప్పకవివర్యవిరచితం బైనయాంధ్రశబ్దచింతామణి యను వ్యాకరణశాస్త్రంబునందు వళిస్వరూపంబును నేకచత్వారింశన్ముఖ్యవిశ్రామంబులును నగాత్రవ్యావిరామంబులును, ప్రాసలక్షణంబులును, సప్తదశప్రధానప్రాసనిర్ణయంబును, (ఉభయప్రాసంబులును) శబ్దాలంకారనిరూపణంబునుం గల వళిప్రాసపరిచ్ఛేదం బను తృతీయాశ్వాసము సంపూర్ణము.

# చతుర్థాశ్వాసము.



సహ్యాత్రిశృంగతో
ర్వీసంసృత్యారిణకృష్ణవేణీతటభూ
[1]వాసైకేశ్వరపూర్వా
శా[2]సప్తసుయోజనప్రసన్న నమస్తే. 1

క. అవధారు శబ్దశాసను, డవనిఁ గలియుగమున కాది నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పినయాం, ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనుఁగించుచున్. 2

తే. ఘనుఁడు వాగనుశాసనకవివరుండు, మునుప పద్యపరిచ్ఛేదమునఁ బదిని
బద్యలక్షణ మెల్ల నేర్పడఁగఁ బల్కె, సారప సంక్షేపముగ నైదుశ్లోకములను. 3

పద్యపరిచ్ఛేదమూలసూత్రంబులు:—

ఆర్యావృత్తశ్లోకంబులు.

వృత్తం జాతి శ్చేతి ద్వివిధం పద్యం గణై ర్నిసర్గాద్యై స్తైః,
సంబద్ధం వృత్తం స్యా దుపగణమాత్రాభి రన్వితా జాతిః.
శాస్త్రార ఏకమాత్రాం లఘో ర్ద్విమాత్రే గురో రితి వదన్తి,
గౌలౌ గగలలసంజ్ఞౌ గ్లౌ హగణో లఘుగురూ లగో వగణః.
గత్రితయం లత్రితయం మనసంజ్ఞా వాద్యమధ్యమాన్త్యర్ణాః,
గురవ శ్చే ద్భజసగణా లఘవో యది యరతసంజ్ఞికాః [3]క్రమశః.
మిత్రౌ నగలా వింద్రా నలనగసలభరతా శ్చంద్రా మలఘుః,
రలరగతలతగనవనహాభలభగసలలనలలనగగసవసహాః.

దీర్ఘ స్సంయుక్తాద్యః ప్లుతార్ణానుస్వారపూర్వవర్ణ శ్చ,
ఏతే గురవ శ్శేషా స్సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయాః.

---

1 వాసైలేశ్వర (వా); వాసైరేశ్వర (పె); వాసైవేశ్వర (పూ. ము. 1859).
2 సప్తము (పూ. ము). 3 క్రమతః (పూ. ము).

వ. ఈశ్లోకంబు [1]లైనను తొల్లిటిసూత్రంబు లయ్యె నవి యెల్ల నింక వివరించెద. 4

[2]ఆ. సకలభాషలందు ఛందంబు దెలియక, పద్యములు రచింపఁ బాటి గామిఁ
దద్విధం బెఱుంగఁదగుఁ గావ్యములు సేయఁ, దలఁపు గలిగినట్టిధన్యులకును. 5

మ. హరభక్తుం డగుభీమసత్కవి సమంతాత్మాత్మ్యనిం జెద్దన
ద్యుతిసిం బాతనఁ గాచిరాజు బసవప్పన్నార్యు స్నిగ్ధరుం
బరమాత్మాజ్ఞనం దగం దలఁచి చెప్పం బూనితి న్వారిచే
త రచింపం బడినట్టిఛందములు నందం బెల్ల నందంబుగాన్. 6

క. భువి నిఘంటువులఁ దెలియక [3]కవితలు రచియించెదు ననుచుఁ గడఁగుట లెల్లన్
వివరింప నిల [4]నెఱుఁగక యీదఁ జనుటన పాటేపోనఁ దలఁచుట గాదే. 7

## ఛందఃప్రభావము.

తే. ఆదిమూలస్వరూపుఁ డైనట్టివేద, పురుషుఁ డాఱుప్రధానాంగముల వెలుంగు
వాని నెఱిఁగింతుఁ జేదిఘూవరకృతాంల, తంగదావ్యాయదేశమధ్యమనికాంత. 8

తే. శిక్ష నాస నిరుక్తంబు చెవులు ఛందస్సుం ఘీయుగ్మంబు కల్పంబు హస్తయుగము
జ్యోతిషము నేత్రయుగళంబు శబ్దవిద్య, సురుచిరానన మామ్నాయపురుషునకును.

తే. పదమునకుఁ బాదంబు లై వెలయుకతన
ఛంద మన్నిటిలో నవశ్యంబు గాదె
పురుషుఁ డఖిలాంగయుతుఁ డయ్యుఁ జరణయుగము
లేక నడవ సమర్థుఁడే లోకమునను. 10

క. ఛందస్సూత్రంబులచేతం దగఁ గూర్పంగఁబడి కడు వాక్యమణుల్
చెందుఁ జతుర్దశవిద్యా, సుందరహారంబు లై యజానిసతిగళమున్. 11

## ఛందోవ్యాపకసంప్రదాయము.

తే. అట్టిఛందంబు నంది దా నంబె మొందు, శివులిచె నంత నొక్కనిచేత నొకరు
వడసిరి సనత్కుమారకుంభజబృహస్ప, తీంద్రవాసుకిపింగళాహిప్రముఖులు. 12

క. గురుఁడయి పింగళికాకో, దరపతి వెసఁ జెప్పె మానిదానవవిద్యా
ధరనిర్జరగంధర్వా, ప్సరోభుజగయక్షసిద్ధసాధ్యుల కెల్లన్. 13

వ. తత్స్వరూపం బెట్టి దనిన. 14

క. ప్రేమమున [5]బ్రహ్మ గాయత్రీమహిమగ్రంథకథితదివ్యచ్ఛందో
నామము లింకను దెలిపెదఁ, గామెపలీపురనివేశ కంసవినాశా. 15

---

1 లేనను (పె). 2 ఈపద్యము (పె) లో లేదు. 3 కవిత్వము రచింతు (ఓ.; పూ. ము). 4 నేరక (ఓ.; పూ. ము). 5 ధర. (ప. పె).

ఆ. ద్వివిధ మయ్యెఁ గావ్య మవని సంగీతసాహిత్యసంజ్ఞలను మహేంద్రవంద్య
సప్తతాళభవము సంగీత మాజయ, దేవకావ్య మదియె పో వచింప. 22

మ. ధర సాహిత్యము గద్యపద్యము లనం దా రెండుభేదంబు లై
పరఁగు న్గద్యమునందుఁ బాదనియతు ల్భావింపఁగా లేవు వా
క్స్ఫురణం బై విలసిల్లఁగా నడువ నొప్పుం గావ్యుఁ డెంతేనియు
మరుతండ్రీ మఱి దీనికే వచననామం బయ్యె నాంధ్రంబునన్. 23

గద్యము. శ్రీవిలాసినీవక్షోరుహద్వయగిరిదుర్గసర్వాధ్యక్ష, పద్మజాండానేకభరణదక్ష
దక్షజామాతృధాతృప్రథమవిశాలనేత్రప్రముఖనిఖిలబర్హిర్ముఖప్రస్తూయమానశుభ
శీల ధరణీతనూజాదిదైత్యకాలకాలయవనజరాసుతప్రభృతిదుష్టక్షితిపతినిగ్రహోపా
యపారీణ, సౌందర్యవిజితారవిందబాణ, బాణాభిధానపూర్వగీర్వాణేంద్రసహస్ర
బాహురంభాస్తంభసునిశితకుఠార, ద్వారకాపట్టణవిహార, హారాంగదవలయమకర
కుండలకిరీటాద్యశేషవిశేషభూషణభూషితగాత్ర, భూమిధరారాతిపుత్త్రమిత్త్ర, మి
త్త్రకుమారీకాంతికాంతారాంతరలతానిశాంత సంచరణ చరణసముల్లాస, యోగీం
ద్రహృదయపయోజవాస, వాసవరత్నాభ, వారిజనాభ, నాగారిస్యందన, నందగోప
నందన, కరుణాలవాల, కాంచనచేల, భుజగేంద్రశయన, పుండరీకనయన, ఆర్తరక్షణ
పరాయణ, గోవింద, ముకుంద నమస్తే నమస్తే పునస్తే పునస్తే. 24

వ. అని యివ్విధంబున గద్యరూపంబుగా నాదిమధ్యాంతశూన్యుండును, చతుర్దశభువన
మాన్యుండును, సకలసద్గుణసంపన్నుండును, సజ్జనాసన్నుండును, భవబంధమోచనుం
డును, పంకజలోచనుండును, కందర్పకోటివిలాసుండును, గామెపల్లినివాసుండును
నగు గోపాలుని వినుతించుజనంబులకు ధర్మంబు కరతలామలకం బర్థంబు మఱిం
గొంగుబంగారంబు, కామంబు తంగెటిచెట్టునం బెట్టినజుంటితేనియ పెరయ, మోక్ష
బంగణంబునం గలవెల్పుటా వివి నిశ్చయం బని విపశ్చిద్వచనంబులు ప్రచుర
లై వెలయుచుండు.

తే. కొంగను నిషాదుఁ డేయఁ గన్గొనినవామలూరభవునిశోకంబు లకారసహిత
మై కదా శ్లోక మయ్యెఁ బద్యంబు నండ్రు, దానిఁగొందఱు నాల్గుపాదములకు.

మూ-సూ:—వృత్తం జాతి శ్చేతి ద్వివిధం పద్యం గణై శ్చస
ఙ్ఖ్యైః, సంబద్ధం వృత్తం స్యాదుపగణై ర్మాత్రాభి రన్వితా జాతిః. 1

తే. పాదనియమంబు గలయట్టిపద్యసమితి
వృత్తములు జాతులును నన ద్వివిధ మయ్యె
నిట నిసర్గగణంబుల వృత్తము లగు
జాతు లుపగణమాత్రల జరుగుచుండు.

## ప్రథమప్రత్యయోద్ధారణ[1]క్రమము.

క. ఆశ్చర్యాశ్చర్యము లగు షట్ప్రత్యయములు దాన నైనప్రస్తారాఖ్య
ప్రత్యయమువలన గణములు, దైత్యాంతక తెలియఁ జెప్పెద న దెట్లన్నన్. 28

మూ. సూ:—శాస్త్రార ఏకమాత్రాం లఘో ర్ద్విమాత్రే గురో
రితి వదన్తి. 2

క. భరితేందిర కామెపలీ, పురమందిర యొక్కమాత్ర భువి లఘువునకున్
గురువు ద్విమాత్రా యుత మీ[2] యురవువలన రెండులఘువు లొకగురువునకున్. 29

తే. మహిని లఘువులు నిలువుగా మునుకొరముల, నైఖరిని వ్రాయ నగు గురుల్ వానికట్టి
యగుట రెండేసి రేఖలు దిరుగకొనబు, గలయఁగాఁ గ్రొన్నెలలభంగి నిలుపఁదగును.

క. సమవృత్త ప్రస్తార, క్రమ మిది వో యుక్త మొదలుగా నెన్నవఛం
దము వలయు నన్నిగురువులు, కమలాప్రియ యడ్డచాలుగా నిడి పిదపన్. 31

ఆ. బంతిబంతి మొదల భాసిల్లు గురు వెంను, దానిక్రింద లఘువు దానికుడిని
పైకి సమము వామభాగోర్ధ్వ గురువులు, నయ్యె సర్వ[3]లఘువు లైనదనుక. 32

తే. ఇటుల వ్రాయంగ నేఛంద మెన్నిబంతు
లన్నిసమవృత్తములు దానియందుఁ బుట్టె
బంతి యొక్కొక్కసమవృత్తపాదగణము
లయ్యె నాలుగుపదముల నవియె నిలుచు. 33

ఇందునకుటీక. ప్రస్తార ప్రత్యయ మనంగా: ఇన్నవఛందంబున నెన్నిసమవృత్తంబులు పుట్టెను? వానిలోపల నిన్నవసమవృత్తంబునకు నేయేగణంబు అని యడిగిన సరి చెప్పెడువిధము:-వా రెన్నవఛందమున నడిగిన నన్నిగురువులు అడ్డపఙ్క్తిగాను వ్రాసి ప్రస్తరించునది. అదియెట్లనిన: ఆబంతి మొదల ఎక్కడ గురు వుండునో దానిక్రిందగా లఘువును వ్రాయునది. ఆలఘువునకు వలపలను మీఁదను గురువుండిన గురువును లఘువుండిన లఘువును నిలుపునది. ఏమియు లేకుండిన నేమియు వ్రాయక ఊరకుండునది. ఈబంతిని ముందుగా వ్రాసినలఘువునకు ఎడమదిక్కునను మీఁదను గురులఘువులలోపలను ఏది ఉన్నను దానిక్రింద గురువే నిలుపుచు వచ్చునది. మీఁదను ఏదియు లేకుండినఁ గ్రిందను వ్రాయఁబనిలేదు. ఇప్పుడు వ్రాసిన క్రమముననే క్రిందిబంతి చూచి యాక్రిందట దిరుగాఁ దిరుగా బంతిని అన్నియు

1 చక్రిము (పె. వ). 2 యొరవు (పూ.ము). 3 గురువు (పె. ప).

పంచమచ్ఛందం బగుసుప్రతిష్ఠయందుఁబ్ర
తిపాదంబునకు నైదేసియక్షరంబుల ము
ప్పదిరెండువృత్తంబులు పుట్టె నందు:-

ప్రీతి. ౫-౩

U I U ర UU గగ.

ప్రీతికి నై ఫా
ల్యితగద్వంద్వం
బై తగుఁ దైత్యా
రాతివసింపన్.

ప్రగుణ. ౫-౪

II U స UU గగ.

ప్రగుణాఖ్యం బొ
ప్పగుఁ జెప్పంగా
సగణాస క్తిన్
నిగమస్తుత్యా.

సతి. ౫-౬

I UIUU గగము.

క్షితిం జగాసం
గతిం దనర్చున్
సతీసువృత్తం
బతిప్రసిద్ధా.

పఙ్క్తి (సుందరి). ౫-౭

UIIభUU గగము.

ఏకభకారం
బేకగగంబుల్
గైకొనుఁ బఙ్క్తిన్
శ్రీకమలాక్షా.

నంద. ౫-౧౩

UU I త I U వగణము.

దేవస్తుత నం
దావృత్తమునన్
తేవ న్నలుపం
గా వచ్చుఁ దవల్.

అంబుజము. ౫-౧౫

U II భ I U లగము.

ఇమ్ముల భకా
రమ్ము లగయు
క్తిం బరఁగుఁ దా
నంబుజమనన్.

వ. షష్ఠచ్ఛందం బగుగాయత్రి యందుఁబ్ర
తిపాదంబునకు నాఱేసియక్షరంబు లై
యఱువదినాల్గువృత్తంబులు పుట్టెనందు:

సావిత్రి. ౬-౧

UUU మ UUU మ.

గోవిందస్తోత్రంబుల్
దైవారు న్యాయుక్తిన్
సావిత్రీవృత్తంబుల్
గావింపంగా నొప్పున్.

విచిత్ర. ౬-౧౦.

I UU య I UU య.

తనర్చు న్విచిత్రం
బనంగా యయాప్తిన్
ఘనశ్యామగాత్రా
మునిస్తోత్రపాత్రా.

తనుమధ్య. ౬-౧౩

UU I త I UU యగణము.

కామేపలివాసున్
మే మెంతు మనంగన్
స్వామీ తనుమధ్యన్
భూమిన్ దయ లొప్పున్.

చంద్రవదన. ౬-౧౯

U II భ I UU య.

చంద్రవదనన్ దే
వేంద్రవినుతా ని
స్తంద్ర తభయంబుల్
సాంద్రముగఁ జెప్పున్.

శశివదన. ౬-౧౬

। । । న । ∪∪ య.

శశివదనాఖ్యన్
విశదము లయ్యెన్
దిశల నయంబుల్
దశముఖవైరీ.

*సురలత. ౬-౧౬

। । । న । ∪∪ య.

మురహరుఁ డేవే
కుచకుచ నాఁగా
ధరణి నయంబుల్
సురలత నొప్పున్.

అందు వసుధావృత్తము

వసుధ. ౬-౨౨

। । ∪ స । । ∪ స.

వసుదేవసుతున్
బొసఁగింపు మనన్
వసుధావ్యయ మిం
పెసఁగున్ సనలన్.

వసుమతి. ౬-౨౬

∪∪ । త । । ∪ స.

బృందావనవిహా
రిం దర్శించెద నం
చందు న్వసుమతిం
బొందింతురు తసల్

వ. సప్తమచ్ఛందం బగునుష్ణిక్కనందుఁ బ్రతిపాదంబునకు నేడేసియక్షరంబు లై నూట యిరువది యెనిమిది వృత్తములు పుట్టె నందు:—

లోల. ౭-౧౦

। ∪∪ య । ∪∪ య ∪ గ.

ధరిత్రీసుతారాతిన్
సరోజాతపత్రాక్షున్
హరిన్ యాగలన్ లోలన్
గరం బొప్ప వర్ణింతున్.

హంసమాల. ౭-౨౦

। । ∪ స ∪ । ∪ ర ∪ గ.

సరగంబుల్ రచింపన్
బరఁగున్ హంసమాలా
నరసింహావతారా
సురవిద్విడ్విదారా.

మదరేఖ ౭-౨౯

∪∪∪ మ । । ∪ స ∪ గ.

గోపాలాఖ్యుఁడు నిచ్చల్, మాపాలం గలఁ డంచున్
రూపింప న్మసగంబుల్, దీపించు న్మదరేఖన్.

కుమారలలిత ౭-౩౦

। ∪ । జ । । ∪ స ∪ గ.

సుమాయుధనిభాంగా, రమాహృదయనాథా
కుమారలలితావృత్త మొప్పు జసగాప్తిన్.

* 'సురలత' కును, 'శశివదన'కును భేదము లేదు. కాఁబట్టి లక్షణమును మరలఁ జూప ననవసరము.

సరసిజము ౭-౩౧

U ||భ|| U స U గ.

శౌరి సరసిజం బిం, పారు భసగయుక్తిన్
సారదనుతిపాత్రా, నీరదనిభగాత్రా.

విభూతి ౭-౪౩

U | U ర | U | జ U గ.

ఇమ్మహి న్రజంబులం, తమ్మనం గకారమున్
గ్రమ్మి యుండునట్టిప్పు, తమ్ము దా విభూతి యౌ.

మధుమతి ౭-౫౬

| | | న U || భ U గ.

కుధరవైరికడన్, విధుఁడు దా నమరున్
మధుమతి న్నవము, న్మథశరీర హరీ.

మదనవిలసితము ౭-౬౪

| | | న | | | U గ.

పదపడి ననగల్, గదసి వెలసినన్
మదనవిలసితం, బది యమతిలకా.

అష్టమచ్ఛందం బగుననుష్టుప్ఛందమునఁ బ్రతిపాదంబునకు నెనిమిదేసియక్షరంబు లై యున్నాటయేఁబదాఱు వృత్తంబులు పుట్టె నందు.

విద్యున్మాల ౮-౧

U U U మ U U U మ U U గగము.

శ్రీదేవీధాత్రీప్రాణేశా, యాదిత్యజ్యోతిస్స్తుత్యా
వేదోద్ధర్తా విద్యున్మాలం, బా దై మాగాప్రాప్తిం బొల్చున్.

వితాన ౮-౬

| U | జ U U U మ U U గగము.

క్షితి జ్ఞగాయుక్తం బైనన్, వితానవృత్తం బై యొప్పున్
పితామహాద్యాదిత్యప్రస్తుతప్రభావా సర్వేశా.

విమానము ౮-౩౮

| U | జ U U | త U U గగము.

క్షమన్ జతాంతస్థగాయుక్తమై రచింపం బొసంగున్
విమాన మంభోరుహాక్షా, రమాంగనావాసవక్షా.

సింహరేఖ ౧-౮౩

U I U ర I U I జ U U గగము.

ద్వారకాపురీవిహారా, మేరుధీర పంచబాణా
కార సింహరేఖకుం బెం, పారు రేఫజల్ గగంబుల్.

చిత్రపదము ౧-౯౯

U I I భ U I I భ U U గగము.

చిత్రపదం బనువృత్తం, బత్రిమునిస్తుతు శౌరిన్
స్తోత్రము సేయఁగ నొప్పున్, ధాత్రిని భాగగయుక్తిన్.

హంసరుతము ౧-౯౭

U U U మ I I I న U U గగము.

శ్రీవత్సాంకితసువక్షా, దేవా హంసరుత మెందున్
భావింప న్మనగగాప్తిన్, గావింపం దగు ధరిత్రిన్.

నారాచము ౧-౧౯

U U I త U I U ర I U వగణము.

క్షీరాబ్ధికన్యకాపతిన్, నారాయణుం ద్రవంబులన్
ఘోరంబుగా నుతించినన్, నారాచవృత్త మై చనున్.

† ప్రమాణి ౧-౧౬

I U I జ U I U ర I U వగణము.

అమిత్రలోకసంహరా, సమగ్రకాంతి భాసురా
క్షమన్ జరేభగంబులన్, ప్రమాణివృత్త మొప్పగన్.

నాగరము ౧-౧౭

U II భ U I U ర I U వగణము.

బాగమరున్ భరేఫసం, యోగలగంబుల న్మహా
యోగినుతు న్వినంబడున్, నాగరనామవృత్త మై.

మాణవకము ౧-౧౦౩

U I I భ U U I త I U వగణము.

శోణమయూఖప్రవిభా, బాణసుపర్వారిహరా
వేణుధరా భత్వములన్, మాణవకం బై తనరున్.

---

†ఇది (పూ. ము.) లో లేదు. దీనిపేరుమాత్రము సంజ్ఞలపట్టీలోనున్నది (చూ. ౧. ౩౯.).

సమాని ౮-౧౦౭

U I U ర I U I జ I U వగణము.

నారదాదిమౌనివరుల్, చేరి శౌరిఁ గొల్తు రనఁగ
గోరి రేఫమును జవముల్, ధారుణి స్సమాని కగుఁగ.

వ. నవమచ్ఛందం బగుబృహతియందుఁ బ్రతిపాదంబునకుఁ దొమ్మిదేసియక్షరంబు లై యేనూటపండ్రెండు వృత్తంబులు వుట్టె నందు:—

* భుజంగశిశుసృతము ౮-౧ ౨౭

I I I న I I I న I U U యగణము.

నిజమున ననయ లొప్పఁగ, భుజగశిశుసృత మయ్యెఁగ
సుజనవినుతచరిత్రా, వృజినతృణఘనదాత్రా.

ఉత్సుకము ౯-౧౮౩

U II భ U II భ U I U రగణము.

వాసవముఖ్యసురస్తుతా, దాసమనోంబుజషట్పదా
వాసిగ భారము లొందినఁగ, భాసిలు నుత్సుకవృత్తముల్.

భద్రకము ౯-౧౮౭

U I U ర I I I న U I U రగణము.

కాద్రవేయశయనా సమా, న్నిద్రదైత్యమదభంజనా
రుద్రమిత్ర రనరేఫముల్, భద్రకంబునకు భాసిలుఁగ.

హాలముఖి ౯-౨౪౧

U I U ర I I I న I I U సగణము.

కింకరీకృతసురవరా, పంకజాతదళనయనా
పొంక మౌ రనసగణముల్, శంక లేక హాలముఖికిఁగ.

ఆ. పఙ్క్తినుంచి వృత్తపఙ్క్తి కిన్నవ వ్రాయి, వడి యటంచుఁ జెప్పఁబడిరొ యిచట
సంస్కృతంబునందుఁ జనుఁ బదవిచ్ఛేద, మడుగు మొదలివర్ణ మగుఁ దెనుఁగున. 177

క. ధర గణితశాస్త్రసంజ్ఞల, శరరసగిరిదంతినిధిదిశాశంకరభా
స్కరవిశ్వమనుదినోర్వీ, శ్వరనామములు యతివర్ణసంఖ్యార్థంబుల్. 178

వ. దశమచ్ఛందం బగుపఙ్క్తియందుఁ బ్రతిపాదంబునకుఁ బదేసియక్షరంబు లై వేయు నిరువదినాల్గువృత్తములు పుట్టె నందు:—

*సంజ్ఞలపట్టీలో 'భుజంగశిశు' అనియేయున్నది; గాని ఇచ్చట (వృా. మా)లో 'భుజంగశశి' అని తప్పుగనున్నది.

పణవము ౧౦-౨౧

UUU మ | | | న | UU య U గ.

ఉర్విన్ మ్నన్యగ ♦ యుతపాదంబుల్, పర్వన్ నద్యుతిఁ ♦ బణవం బయ్యెన్
గీర్వాణాహిత♦గిరిశాకేశా, సర్వేశా రవి♦శతసంకాశా.

మయూరసారి (మయూరభాషిణి) ౧౦-౧౭౧

U | U ర | U | జ U | U ర U గ.

వెక్కసించె శైల ♦ విశ్రమంబు, లొక్కి రేఫజంబు♦లున్ రగంబుల్
చక్కఁగా మయూర♦సారి కొప్పున్, నిక్క మంబుజాత♦నేత్ర శౌరీ.

రథాలి ౧౦-౨౭౭

U | U ర | | | న U | U ర U గ.

గోత్రవిశ్రమము ♦ గూడి భక్తిన్, ధాత్రి రేఫనగ♦ణంబు లొప్పెఁ
బోత్రిరూప రగ♦ము రథాలం, జిత్రభంగి నుతి♦సేయు నిన్నున్.

రుగ్మవతి ౧౦-౧౯౯

U || భ UUU మ || U స U గ.

అంగయతిం బొం♦దై భమస ల్పూర్వం గురుయుక్తి ♦ రుగ్మవతి న్స
త్యాంగనకై తేఁ♦డా సురశాఖిం, బొంగుచు గోపీ♦పుత్త్రుఁ డనంగన్.

*చంపకమాలి ౧౦-౧౯౯

U|| భ U U U మ | | U స U గ.

భూమిధరక్రాంతు ♦ లొప్పలుపారన్, బ్రేమ భమంబు ల్గో♦రి సగంబుల్
దామ నుతించు న్నం♦దసుతు న్బా, మామకరాంకుం జం♦పకమాలిన్.

మణిరంగము ౧౦-౨౮౧

U | U ర || U స || U స U గ.

అంగనామణు ♦ లంగయతుల్గా, సంగ మెచ్చ ర♦సాగురుయుక్తిన్
బొంగుచు న్యదు♦పుంగవు వేఁడన్, రం గగున్ మణి♦రంగ మనంగాన్.

మత్తా (హంసశ్రేణి) ౧౦-౨౮౧

UUU మ U || భ || U స U గ.

శైలక్రాంతి న్మభ♦సగ లొలిం, గ్రాల న్మత్తాఖ్యను ♦ గనుపట్టున్
బాలించె న్యాదవ♦పతి యాపాం, చాలిం గౌరవ్యుల♦సభ నాఁగన్.

---

*రుగ్మవతికిని, చంపకమాలికిని గణములలో భేదము లేదు; యతిస్థానమున మా
త్రము భేదముగలదు గాన వేఱుగఁ జెప్పఁబడినది.

కౌముది ౧౦-౨౯౯

। । । న ◡◡ । త ◡◡ । త ◡ గ.

మునినుతా కౌ•ముదీవృత్త మై, వ్వను నగాగం•బులన్ పద్యతిన్
దుని పెం పాల•స్త్య భూపుత్రికై, కిమక రామ•క్షితీశం డనన్.

భోగివిలసితము (విలసితము) ౧౦-౩౫౧

◡ ॥ భ ॥ ◡ స । ◡ । జ ◡ గ.

సాగభసములున్ • జగంబులున్, జా గగు నగవి•శ్రమంబులన్
భోగివిలసితం•బుఁ జెప్పఁగా, సాగరతనయా•సమన్వితా.

మనోరమ ౧౦-౩౮౮

। । । న ◡ । ◡ ర । ◡ । జ ◡ గ.

వరజగంబుల • న్మనోరమల్, సరవి శైలవి•శ్రమంబులన్
దురితదూరు సిం•ధుజాపతిన్, సొరిది సన్నుతిం•చు నెంతయున్.

*శుద్ధవిరాటి ౧౦-౪౮౫

◡◡◡ మ । । ◡ స । ◡ । జ ◡ గ.

చా లొప్ప న్మస•జ ల్గకారమున్, గ్రాలు న్శుద్ధవి•రాటిన్ పద్యతిన్
నీలాంగా రమ•ణీమనోభవా, నాళీకాసన•నందనస్తుతా.

నందిని ౧౦-౩౫౯

◡ । । భ ◡◡ । త । ◡ । జ ◡ గ.

శ్రీరమణా ని•ర్జితదానవా, సారసపత్రే•క్షణ పద్యతిన్
సారె భతంబు•ల్జగము ల్దగన్, ధీరులచే నం•దిని నాఁ జనున్.

పఙ్క్తి ౧౦-౮౩౯

◡ । । భ ◡ । । భ ◡ । । భ ◡ గ.

గ్రావవిరామమ•గా విబుధుల్, భావజుతండ్రి ని•భాభగురుల్
గా వినుతించినఁ•గావ్యముల, న్వావిరిఁ బఙ్క్తియ•నం బరఁగున్.

వ. ఏకాదశచ్ఛందం బగుత్రిష్టుప్పునందుఁ బ్రతిపాదంబునకుం బదునొకం డేసియక్షరంబు లై ౨౦౪౮ వృత్తంబులు పుట్టె నందు:—

---

* (పూ. ము.) సంజ్ఞలపట్టీలో 'వరాటి' అనియున్నది; (పె)లో విరాటి; విరాట (ప).

### ఇంద్రవజ్ర ౧౧-౩౫౭

UU । త UU । త । U । జ UU గగము.

ఇంతు ల్సదా పాదుమ♦రింద్రవజ్రల్, స్వాంతంబున న్మోహము♦సంధిలంగన్
దంతావళి శ్రాంతిని♦తా జకార, ప్రాంతంబునం గద్వయ♦మంద మందన్.

### ఉపేంద్రవజ్ర ౧౧-౩౫౮

। U । జ UU । త । U । జ UU గగము.

క్షపాచరారు ల్జతి♦జ ల్గగంబుల్, బ్రపూర్ణ మై దంతివి♦రామ మొప్పన్
ద్విపాధిపత్రాత ను♦తింపఁ జేరై, యుపేంద్రవజ్ర ల్వెల♦యు న్ధరిత్రిన్.

### ఉపస్థితము ౧౧-౩౬౫

UU । త । U । జ । U । జ UU గగము.

భక్తు ల్హరిమీఁద ను♦పస్థితం బా, సక్తి న్విరతు ల్కరి♦సంఖ్య సాగన్
సూక్తు ల్గాని చెప్పెడు♦చోఁ దజాగా, యుక్తం బగుచుం జెలు♦వొందుచుండున్.

### దోదకము ౧౧-౪౩౯

U । । భ U । । భ U । । భ UU గగము.

తోరపువేడుక ♦ [1]దోదక మొప్పన్, భూరివిరామము ♦ భూధరసంజ్ఞం
బారుచు భాభగ♦గాన్విత మై లక్ష్మీరమణా విర♦చింప నెసంగున్.

### రథోద్ధతము (పరాంతిక) ౧౧-౬౯౯

U । U ర । । । న U । U ర । U వగము.

అంది రేఫనర♦వాప్తి నొప్ప గో,విందు భూమిధర♦విశ్రమంబులన్
జెంది కబ్బములఁ ♦ జిత్రభంగిఁ జె,న్నొందు నెంతయు ర♦థోద్ధతం బిలన్.

### భద్రకము ౧౧-౭౦౪

। । । న । । । న U । U ర । U వగము.

నరకదమన ♦ నారవంబులన్, సరగఁ గుధర♦సమ్మితంబు లై
విరతు లమర ♦ వేడ్కఁ జెప్పినం, బరఁగుఁ గృతుల♦భద్రకం బనన్.[2]

### స్వాగతము ౧౧-౪౪౩

U । U ర । । । న U । । భ UU గగము.

స్వాగతంబు దగు ♦ శైలవిరామం, బై గజేంద్రవర♦దా రనభంబుల్
పై గురుద్వయము ♦ భాసిలఁ జెప్పన్, యోగిమానసప♦యోజమిళిందా.

---

1 తోటక (పె. ప). 2 చూ. చంద్రిక.

కాంతి ౧౧-౫౭౭

∪∪ | త | ∪ | జ | ∪ | జ | ∪ లగము.

క్రాంతు ల్కారిసంఖ్యను • రాజిలఁగా, సంతోషమూతోడఁ ద•జాలగముల్
చింతింపఁ బదంబులఁ • జెంద రమా, కాంతావ్యాదయేశ్వర • కాంతి యగున్.

శ్యేని ౧౧-౬౫౩

∪ | ∪ ర | ∪ | జ ∪ | ∪ ర | ∪ వగణము.

మానితాద్రివిక్ర•మంబుఁ బూనఁగా, శ్యేనికి న్రజ ల్వ•యి న్రవంబులన్
గాని యొండు గూర్పఁ • గాదు రుక్మిణీ, ప్రాణనాథ కామె•పల్లిమందిరా.

వాతోర్మి ౧౧-౫౧౭

∪∪∪ మ ∪ | | భ ∪∪ | త | ∪ వగణము.

ఆమోదం బొప్పఁగ • వ్యాసాదికవుల్, భూమిన్ధ్ర క్రాంతులు • పొంగార మహీ
భామాప్రాణేశ మ•భంబుల్ తవలన్, దా మీవాతోర్మిని • దాపింతు రొగిన్.

కలితాంతము (గీతాలంబనము) ౧౧-౫౭౭

∪ ∪ | త | ∪ | జ | ∪ | జ | ∪ లగము.

సామోద్భవవిక్రమ•సంయుత మై, వేమాఱు తజాలగ•విస్తృత మై
దామోదరదేవుక•థ ల్పలుకన్, భూమిం గలితాంతము•పూర్ణ మగున్.

శాలిని ౧౧-౨౮౯

∪ ∪ ∪ మ ∪ ∪ | త ∪ ∪ | త ∪ ∪ గగము.

ధీరశ్రేష్ఠు ల్సన్ను•తింపం గవీంద్రా,ధారం బై ధాత్రి న్మ•తా గాగణా ప్తిన్
దోరం బై భూభృద్య•తుల్ సంఘటింపన్, నీ రేజాక్షా శాలి•నివృత్తి మొప్పున్.

సుముఖి ౧౧-౫౭౦

| | | న | ∪ | జ | ∪ | జ | ∪ లగము.

ఖగపతివాహ • కపర్దినుతా, మృగపతిమధ్య • హితా ర్తిహరా
నగవిరమం బె•నయంగ నజా, లగములచేఁ జె•లఁగు న్సుముఖుల్.

భ్రమరవిలసితము ౧౧-౧౦౦౯

∪ ∪ ∪ మ ∪ || భ | | | న | ∪ వగణము.

ఏచుంఘిర్మిం బార•యి మగణభన, ల్వా యొక్కం డవ్వ•లను నెలకొనన్
మాయాతీతా భ్ర•మరవిలసితం, బై యొప్పుం దర్క•ముతుల నిలుచున్.

వృత్త ౧౧-౨౮౮

I I I న I I ◡ స ◡ ◡ I త ◡ ◡ గగము.

అనయమును వే♦దాంగంబు సెప్పఁగ, దనుజహర న♦ స్తంబు ల్గగంబుఁ
బెనఁగొని ధరా♦భృద్విక్రమంబుల్, దనరునది వృ♦త్తావృత్త మంచున్.

పృథ్వి ౧౧-౮౯౬

I I I న I I I న I ◡ I జ I ◡ వగము.

నలినభవనుత♦నాజలగం, బులు గలయతులఁ ♦ బొందుపడం
బెలుచఁ బలికినఁ ♦ బృథ్వి యనఁగ, వెలయు నొకసమ♦వృత్త మిలన్.

వృంత ౧౧-౨౭౬

I I I న I I I న I I ◡ స ◡ ◡ గగము.

నగణయుగము సగ♦ణం బొందఁగ, గగ మొకటియు జత♦గాఁ గూడఁగ
ఖగవిరమములను ♦ గల్పింపఁగ, దగుఁ గవులకు వసు♦ధ న్వృంతల్.

మౌక్తికమాల ౧౧-౪౮౭

◡ I I భ ◡ ◡ I త I I I న ◡ ◡ గగము.

భక్తజనత్రాత ♦ భతనగాసం, యుక్తము లై మాని♦యుతయతుల్ సు
వ్యక్తము లై సూక్తు♦లమరఁ జెప్పఁగ, మౌక్తికమాలాక్ర♦మము లెసంగున్.

ఉపస్థితము (శిఖండిపిరుతము); (స్త్రీ) ౧౧-౨౮౬

I ◡ I జ I I ◡ స ◡ ◡ I త ◡ ◡ గగము.

ఉపస్థితమునం ♦ దొప్పారుచుండఁగ, దపస్వివిరతు ♦ ల్గాకం జకారం
బుపై సతగణం♦బు ల్గద్వయంబుఁగ, గపిధ్వజసఖా ♦ కామేపలీశా.

ఏకరూప ౧౧-౩౯౬

◡ ◡ ◡ మ ◡ I I భ I ◡ I జ ◡ ◡ గగము.

ఏపారం గావ్యముల ♦ నేకరూపల్, త్మాపుత్రీశుఁ ప్రభజ♦గాగణంబుల్
బ్రాపించుం గుంజరవి♦రామ మొప్పఁగ, బాపంబుల్ వాయుటకుఁ ♦ బ్రస్తుతింపన్.

చంద్రిక ౧౧-౨౦౪

I I I న I I I న ◡ I ◡ ర I ◡ వగము.

అగవరధర నార♦వాన్వితం, బుగఁ గృతులను జెప్పఁ ♦ బొందికై
తగ నిధివిరమంబు ♦ దాఁకఁగా, జగతిని నెగడొందుఁ ♦ జంద్రికల్.

వ. ద్వాదశచ్ఛందం బగుజగతి యందుఁ బ్రతిపాదంబునకుఁ బండ్రెండేసి యక్షరంబులై ర్ఙా వృత్తంబులు వుట్టె నందు.

స్రగ్విణి ౧౨-౧౭౧

U I U ర U I U ర U I U ర U I U ర.

కామెపల్లీమహా • గ్రామమధ్యంబునన్
భూమిదేవోత్తము • ల్పూజ సేయంగ నా
స్వామియున్నాఁడనన్ • స్రగ్విణిన్ శైలవి
క్రామయుక్తిం జతు • ష్కంబగున్ రేఫముల్.

భుజంగప్రయాతము ౧౨-౧౮౧౬

I U U య I U U య I U U య I U U య.

భజింతున్ సదా కామె • పల్లీనివాసున్
వ్రజస్త్రీవిటున్ యాద • వశ్రేష్ఠు నంచున్
భుజంగప్రయాతాఖ్య • మొ ల్పొల్లు యాలన్
గజవ్రాతవిశ్రాంతి • గాఁ జెప్ప నొప్పున్.

తోటకము ౧౨-౧౬౭౬

I I U స I I U స I I U స I I U స.

తగుఁ దోటకవృత్తము • ధాత్రియతిన్, సగణంబులు నాలుగు • సాగినఁ బన్నగపుణ్యనదీసుర • నాథదిశా, జగతీద్విజపట్టణ • సంచరణా.

జలధరమాల ౧౨-౨౮౧

U U U మ U I I భ I I U స U U U మ.

ధీరుల్ మెచ్చం గృతుల న • తిశ్రీదం బై, మార్గాకారా జలధర • మాలావృత్తంబై రాజిల్లున్ భువిఁ జతు • రాస్యక్రాంతుల్, సారం జేరన్ మభసమ • సంయుక్తంబై.

వంశస్థము ౧౨-౧౭౨

I U I జ U U I త I U I జ U I U ర.

జతల్ జరేఫంబులు • సామజాతస, మ్మితాక్షరక్రాంతుల • మెప్పు వుట్టఁగాఁ బతంగరాజధ్వజుఁ • బద్మలోచనున్, నుతింప వంశస్థ మ • నూన మై చనున్.

ఇంద్రవంశము ౧౨-౧౭౨౧

U U I త U U I త I U I జ U I U ర.

ఇందీవరాక్షుల్ తగ • నింద్రవంశ మా, నందంబునం బాడిరి • నందసూతిపై డెందంబుల న్మోహమూ • శేవ మీఱఁగాఁ, బొం దై గజక్రాంతులు • పూనఁదాత్రలన్

ద్రుతవిలంబితము ౧౨-౧౮౬౮

।।। న ◡ ।। భ ◡ ।। భ ◡ । ◡ ర.

ద్రుతవిలంబిత•రూప మగుం గుభృ, ద్యతి నభారయు•తంబుగఁ జెప్పినన్
నతజనార్తివ•నశ్వసనప్రియా, వితతభూసుర•వీరపురాలయా.

తోదకము (తామరసము) ౧౨-౭౨౦.

।।। న । ◡ । జ । ◡ । జ । ◡◡ య.

సలలితతోదక•సామజవిశ్రాం, తులను నజాయలఁ • దోదకవృత్తం
బలవడుఁ గేశవ•రాసురకాష్ఠా, జ్వలనవనీశర•సాస్థలవాసా.

ప్రియంవద ౧౨-౮౦౦

।।। న ◡ ।। భ । ◡ । జ ◡ । ◡ ర.

విభు శమీరపృథు•వీజరత్నభా, గభవనాలయునిఁ గామెపల్లికా
ప్రభు నభజ్రలను • బ్రస్తుతింప నా, నిభవిరామమున • నీప్రియంవదల్.

ప్రమితాక్షరము ౧౨-౧౭౭౨

।। ◡ స । ◡ । జ ।। ◡ స ।। ◡ స.

ప్రమితాక్షరం • బమరుఁ బద్మజవి, శ్రమ మొప్పమీఱ • సజసాయుతమై
యమునానదీతటవి•హార పృథా, ప్రమదాకుమారసఖ • భద్రయశా.[1]

జలోద్ధతగతి ౧౨-౧౭౨౬

। ◡ । జ ।। ◡ స । ◡ । జ ।। ◡ స.

జలోద్ధతగతిం ది•శాగజయతిన్, మెలంగు నినుమాఱు • మెచ్చఁగ జసల్
ఫలానుభవ కామె•పల్లినిలయా, ఖలాంబుదసమీర • కామజనకా.

విశ్వదేవి ౧౨-౧౯౨౨

◡◡◡ మ ◡◡◡ మ । ◡◡ య । ◡◡ య.

శ్రీవత్సాంకా పద్మాధ•రిత్రీకళత్రా, దేవేంద్రస్తోత్రా విశ్వ•దేవీసమాఖ్యం[జెప్పన్.
బై విప్పాందు స్థాయాగ•ణావాప్తి దిక్సం, ఖ్యావిశ్రామంబుల్ చోద్య•మైయుండఁ

చంద్రవర్త్మ ౧౨-౧౯౬౮

◡ । ◡ ర ।।। న ◡ ।। భ ।। ◡ స.

ఇంద్రవంద్య జగ•దీశ ఘనయశ, స్సాంద్ర కామెపలి•సద్మ యదువరా
చంద్రవర్త్మ యగు • శైలవిరతి ని, స్తంద్ర మై రనభ•సంబు లమరినన్.

---

1 (ప. వె) లో ౧౭౭౨ అనియే ఉన్నది. (పూ. ము) లో ౧౭౮౦ ఉన్నది.
ఇదిచూచి యిటీవలివారు వ్రాతప్రతులలో సరిగానున్న సంఖ్యను తప్పుగాదిద్దుకొన్నారు.

ప్రహేయము ౧-౨-౫౭౬

।।।న।।।న◡◡◡మ।◡◡య.

కరివిరమణముల్ • గా నామయుంబుల్, బరఁగ నిలుపఁ జా•పట్టుం బ్రహేయం
బురగశయన భో•జోర్వీశపుత్రీ, వరపరమకృపా•వారాశీ కృష్ణా.

ప్రముదితవదన ౧-౨-౧౨౧౬

।।।న।।।న◡।◡ర◡।◡ర.

మమత నిభవిరా•మముల్ గూడఁగా, జమిలినరములఁ • సదా చెన్న గుఁ
బ్రముదితవదనల్ • రమానాయకా, సుమశరజనకా • సుపర్వస్తుతా.

కుసుమవిచిత్రము ౧-౨-౯౭౬

।।।న◡◡య।।।న◡◡య.

కుతలములోనం • గుసుమవిచిత్రం, బతిశుభదం బై • యగయతు లన్నం
దతనయ యొప్పుఁ • నయ లినుమా లై, సతతము విద్వ•జ్జనులు నుతింపన్.

మణిమాల ౧-౨-౭౮౧

◡◡।త।◡◡య◡◡।త।◡◡య.

కామేపలినామ•గ్రామస్థలవాసా, స్వామీ తయకార•ద్వంద్వంబు పొసంగుఁ
వేమాఱుమహీభృ•ద్విశ్రాంతులతోడఁ,భూమండలిఁగూర్పం•బొల్చున్మణిమాలల్.

మేఘవిలసితము ౧-౨-౨౦౮౧

◡◡◡మ ।।।న ।।।న ।।◡ స.

కాళిందీముఖ•కమలమధుకరా, నాళీకాసన•నతరసవిరతు
ల్గాళిల మ్మేఘవి•లసితము దనరు, న్వాలాయంబు మ•ననసగణములన్.

త్రయోదశచ్ఛందం బగునతిజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదుమూఁడేసియక్ష
రంబు లై యెనిమిదివేలనూటతొంబదిరెండువృత్తములు పుట్టె నందు:—

మత్తమయూరము ౧౩-౧౬౩౩

◡◡◡మ◡◡।త।◡◡య।।◡స◡గ.

శ్రీగోపాలా తంగెడ•సీమావనిగేహా
వాగీశాదిస్వర్గని•వాసస్తుతిపాత్రా
యోగిధ్యేయా మత్తమ•యూరంబున కొప్పుఁ
నాగక్రాంతు ల్మత్యగ•ణంబు ల్సగ మొందన్.

ప్రహర్షిణి ౧౩-౧౪౦౧

UUUమ। । న।U।జU।Uర Uగ.

ధీరుల్ సింధురవిర♦తిజ్ఞ మనజ్ర గంబుల్, సారెం బాదములను♦సంఘటించుచుండన్ గ్రూరారి ప్రహారున♦కుం బ్రహర్షణుల్పెం, పారం జెప్పుదురుమ♦హాముదంబుతోడన్.

ప్రభాతము ౧౩-౧౩౯౨

। । న।U।జ।U।జU।Uర Uగ.

మొనసి నజారగ♦ముల్ ప్రభాతవృత్తం, బునకు మదేభస♦మూహవిశ్రమంబుల్ దనరఁగ నిల్చుఁ బృ♦దాకురాజతల్పా, కనకమయాంశుక ♦ కొమ్మెపల్లివాసా.

జలదము ౧౩-౩౭౪౩

U। భU।Uర। । నU। భUగ.

బంగరుచుంగుపచ్చడము ♦ పైఁ గలయా, తంగెడదేశవాసు జల♦దంబులచే తం గడు సన్నుతింతు నవ♦తారయతిన్, బొంగుచు సారె భర్నభగ♦ముల్ గదియన్.

మంజుభాషిణి ౧౩-౨౭౯౬

। ।Uస।U।జ। ।Uస।U।జUగ.

ఉరగాపగాదిహరి♦దుర్వారాలయా, కరుణాసముద్ర మార♦గర్వభంజనా యిర వొందుచుండు సజ♦లిబ్బడింపఁ బల్మరు గాత్రిధాత్ర్యయతి♦మంజుభాషిణుల్.

రుచిరము ౧౩-౨౮౦౬

।U।జU। ।భ। ।Uస।U।జUగ.

గదాధరున్ జభసజ♦గంబులన్ గవుల్, సదా పితామహయతి♦సాగుచుండఁ గా ముదంబుతోడ రుచిర♦ము ల్రచింతు రి, ట్లుదారభక్తిఁ గృతుల ♦ సర్వార్థలిన్.

క్షమ (క్షప) ౧౩-౨౫౬౮

।। న।। నUU।తUU।తUగ.

క్రమమున నిభవి♦శ్రాంతి నాతగయు, క్తముగ సుకవిప♦ద్యంబు లూహించినన్ క్షమ ననఁ బరఁగుం ♦ గంజపత్రేక్షణా, సుమశరజనకా ♦ శూరవంశోత్తమా.

చంచరీకావళి ౧౩-౧౧౭౩

UUUమUUUమU।Uర U।Uర Uగ.

కంబుగ్రీవాసత్యా♦కామినీప్రాణనాథా, బింబోష్ఠామారాగ♦ల్పేర్చిభూభృద్యతుల్గాం చంబాదంబైధాత్రిం♦జంచరీకావళీనా, మంబొందుం గావ్యశ్రీ♦మానినీభూషణంబై.

మత్తహంసిని ౧౩-౨౯౬౦

U|జUU|త||U|స|U|జU గ.

మనోహరాకార • మధుదైత్యసంహారా, వినాయకారూఢ • విబుధేంద్రవందితా
జనార్దనా జత్స • జగురుల్ కృభృద్యతిఁ, దనర్చుంబద్యంబు • దగు మత్తహంసినిన్.

సుమంగలి ౧౩-౧౬౬౨

|| U స | U | జ || U స || U స U గ.

సారిదిఁ ధరిత్రిని • సుమంగలివృత్తం, బరయంగ సామజ • యతిఁ సజసాగల్
తిర మొంద నొప్పు వి•ధిపూజితపాదాం, బురుహాద్వయా ఖర•మురాసురవైరీ.

వ. చతుర్దశచ్ఛందం బగుశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాలుగేసియక్షరంబు
లై ౧౬౩౮౪ వృత్తములు పుట్టె నందు:—

వనమయూరము ౧౪-౩౫౨౩

U || భ | U | జ || U స | | | న UU గగము.

శ్రీకర ధరాధర • జిష్ణునుత పుణ్య, శ్లోక భజసన్నగగ • లుఁ ద్రుహిణసంఖ్యన్
సోఁకువిరమంబుగను • చున్వనమయూరా, ఖ్యాకమనువృత్తమిల • నత్తమిలుచుండున్.

వసంతతిలక (సింహోన్నతము, ఔద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి)
౧౪-౨౯౩౩

UU | త U || భ | U | జ|U|జUU గగము.

శ్రీమేదినీరమణ • సింధుతరంగరంగ, ద్రామాహితల్ప విన • తానుతవాహ రాధా
కామా వసంతతిల • కన్దభజాగగంబుల్, సామ్రభూతయతి • సాగిధరం జెలంగన్.

భూనుతము ౧౪-౩౬౧౬

| U | ర | | | న U || భ U | | భ UU గగము.

మున్మరించి రనభాగగ • ముల్ దశవిశ్రా, మంబుభూతలమునందున • మానితమయ్యెన్
జాంబవత్యధిప కేశవ • సారసనేత్రా, కంబునందకగదాధర • ఖండితసాళ్వా.

సుందరి ౧౪-౫౬౧౬

U | | భ U | | భ U | U ర | | Uస|Uవగణము.

సూరిజనప్రకరంబు • సుందరి నెన్నఁగా
భారసవంబులు రత్న • భాసితవిశ్రమా
ధారమగాఁ దనరారుఁ • దార్క్ష్యతురంగమా
శౌరి ముకుందమునీంద్ర • సన్నుతకేశవా.

ప్రహారణకలిత ౧౪-౫౧౨౮

। । । న । । । న ⏑ । । భ । । । న । ⏑ వగణము.

పనిగొను నెపుడుం బ్రహారణకలితన్, ననభనవలు మం దగజవిరమమునన్
ఘననిభఘనవిగ్రహా బకమురమ, ర్దన మధునరక ప్రహారణకలితా.

వసంతతిలకము ౧౪-౩౫౨౦

। । ⏑ స । ⏑ । జ । । ⏑ స । ।। న ⏑ ⏑ గగము.

నవనందినిన్ సజగణస్సగగ లారయన్, నవవిశ్రమంబును దనర్చి చెలువొప్పన్
నవనీతచోరకు జనార్దనును పేంద్రున్, భవదూర నెంతురు సభాసదులుభక్తిన్.

అపరాజితము ౧౪-౫౯౨౮

। । । న ।। । న ⏑ । ⏑ ర ।। ⏑ స । ⏑ వగణము.

ననరసలగ లొందిన న్నవవిశ్రమం, బును గలిగి కవీంద్రభూషిత మై జనా
ర్దన నిగమసుగోచరా యపరాజితం, బనఁగఁ దనరు శ్రావ్యమై వినువారికిన్.

అసంబాధ ౧౪-౨౦౯౭

⏑ ⏑ ⏑ మ ⏑ ⏑ । త । । । న । । ⏑ స ⏑ ⏑ గగము.

వాలాయంబున్ సత్కవిజనములు వాక్రువ్వన్
వాలారున్ గోవింద వరద ఘృణివాత్సల్యా
కాళిందీప్రాణేశ మతనసగగప్రాప్తిన్
జాలాభాస్వద్విశ్రమమునను నసంబాధల్.

శమలవిలసితము ౧౪-౮౧౯౨

। । । న । । । న । ।। న । । న ⏑ ⏑ గగము.

క్రమమున నననన గగములు గూడన్, గమలవిలసితము కమలజవిశ్రా
మము జగతిని నగుమహితచరిత్రా, కమలదళనయన కడుఁ బొగ డొందున్.

వ. పంచదశచ్ఛందం బగునతిశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదిహేనేసి యక్షరంబులై ౩౨౭౬౮ వృత్తంబులు వుట్టె నందు.

మాలిని ౧౫-౪౬౫౬

।। । న ।। । న ⏑ ⏑ ⏑ మ । ⏑ ⏑ య । ⏑ ⏑ యు.

కనకకశిపుహర్తన్ గానలోలున్ శుభాంగున్
దనుజహరణదక్షున్ ధర్మమార్గానుసారిన్
మనసిజగురు నెంతున్ మాలినివృత్త మందున్
ననమయయగణంబుల్ నంనివిశ్రాంతి గూడన్.

## సుకేసరము (భద్రకము) ౧౫-౧౧౧౮౪

I I IనIUIజUIIభIUIజUIIUర.

సురుచిరధర్మమూల మయి♦సొంపు మీఱు నా, గిరిధర నాభిపంకజసు♦కేసరంబునై
ఖరి నజభజ్రము ల్గదియుఁ♦గల్పనంబునన్, గిరిశవిరామసంగతి సు♦కేసరంబునన్.

## మనోజ్ఞ ౧౫-౧౧౬౩౨

I I I నI U IజIUI జUI IభUIUర.

అజమృడవాసవసంత♦తార్చితపాదపం
కజయుగళున్ హరి నిర్వి♦కారు మనోజ్ఞ నా
బుజా వగువృత్తమునందుఁ ♦ బ్రీతి నుతింపఁగా
నజజభరంబులు వొల్చు ♦ నచ్చిన దిగ్యతిన్.

## మణిభూషణము ౧౫-౧౧౭౦౭

U I U ర I I I న U I I భ U I I భ U I U ర.

వింత యైనమణిభూషణ♦వృత్తమునందు న
త్యంతమోదమున నెన్నను ♦ నద్దశవిశ్రమా
క్రాంత మయ్యు రనభారలఁ ♦ గంజదళాక్షుఁ గం
సాంతకు న్నరకసంహరు ♦ నార్యసమూహామూల్.

## సుగంధి (*శాలినీ, చామర, ప్రశాంతి) ౧౫-౧౧౯౨౩

UIUరIUIజUIUరIUIజUIUర.

రంబు జంబు రంబు జంబు ♦ రంబు చెన్నుమీఱఁగాఁ
దొమ్మిదింట విశ్రమంబు ♦ తోర మై సుగంధికిన్
గ్రమ్మఁగా నుతింప నొప్పుఁ ♦ గానలోలుఁ డచ్యుతుం
డంబుజాక్షుఁ డాదిదేవు ♦ డక్షరాఖ్యుఁ డెప్పుడున్.

## ఇల ౧౫-౧౬౩౬౪

IIUసIUIజI I IనI I IనII Uస.

గజవిశ్రమంబునఁ ♦ గనలు నిల యనఁగా, సజనాస లుండిన♦సకలకవికృత మై
భుజగాశనధ్వజు♦భుజగపతిశయనున్, వ్రజసుందరీముఖ♦వనజహితుఁ బొగడన్.

---

* ౧౧వఛందములో నతిరొక శాలినీవృత్తము గలదు. (249 పుట)

చంద్రరేఖ ౧౫-౪౬౨౫

UUUమU|UరUUUమ|UUయ|UUయ.

మత్తేభక్రాంతిచే ర◆మ్యం బై మహిం జంద్రరేఖా
వృత్తం బౌ మ్రమ్యయంబుల్ ◆ వేడ్కన్ హృషీకేశుఁ బార్థ
త్రాత న్నారాయణు న్వి◆శ్వామిత్రయాగారిదైత్య
చ్ఛేత్త న్దాశార్హు లక్ష్మీ◆చిత్తాబ్జవాసు న్నుతింపన్.

నలిని ౧౫-౧౪౦౪౪

IIU స IIUసIIUసIIUసIIUస.

సససాసలచే దశవి◆శ్రమయుక్తతచే, బొసఁగ న్నలినిన్ మణికం◆బు సుదర్శనహ
స్తసరోరుహువామనుఁగే◆శవుశౌరినజున్, వసుదేవనృపాలతనూ◆భవుఁ బాడుదురా.

అలసగతి ౧౫-౭౬౪౮

|| |న| |Uస || |నU |భ|UUయ.

అలసగతి నాఁ జను స◆భాంతరమునందు, న్విలసదవతారయతి ◆ నిండి నసనభ్యల్
గలయ శకటాసురవి◆ఘాతను విశిష్టున్, బలుమఱుఁగవీశ్వరులు◆ప్రార్థనలు సేయన్.

మణిగణనికరము ౧౫-౧౬౩౮౪

| | |న| | |న| | |న| | |న| |Uస.

మణిగణనికరమ◆మను లఘుగురు వై, మణివిరమణ మయి ◆ మధుదనుజహరున్
ఫణిపతిశయనునిఁ ◆ బ్రమథితనరకు, న్ఘృణిమదయుతనిభు◆ని బొగడఁ దనరున్.

వ. షోడశచ్ఛందం బగు అష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాఱేసియక్షరంబు లై
౬౫౫౩౬ వృత్తములు పుట్టె నందు:—

ప్రియకాంత ౧౬-౧౩౨౬౪

| | |న|UUయ| | |న|UUయ| |Uస|Uగ.

అమరులు భృత్యు ల్తనయు వి◆ యద్గంగ ధరిత్రి
కమలలు [1]పెండ్లాములు రవి ◆ కంజారులు గన్నుల్
శమితతృణావర్తున కని ◆ చాటుం బ్రియకాంతా
ఖ్యము శివసంఖ్యావిరమణ ◆ మై న్యన్యసగం బై.

పంచచామరము ౧౬-౨౧౮౪౬

|U|జU|Uర|U|జU|Uర|U|జUగ.

జరజ్రజంబులున్ గముం బొ◆సంగి తొమ్మిదింటిపై
విరామ మొంది సత్కవు ల్స◆విస్తరంబు సేయఁగా

1 పెంళ్లాములు.

బరాత్పరుండు మాధవుండు ◆ పంచచామరంబునన్
బ్రరూఢగుంభనంబులంటఁ ◆ బాడ నొప్పు ధాత్రిలోన్.

పద్మకము ౧౬-౨౩౮౧౬

।।। న ∪ ।। భ ∪ । జ ∪ । జ ∪ । జ ∪ గ.

నభజజాగగణయుక్తిఁ బ◆నాకివిరామక
ప్రభవ మై కృతుల నొప్పును ◆ బద్మక మంద మై
ప్రభుఁడు వక్రమును ద్రుంచి సు◆రక్షితుఁ జేయు సా
మభవపద్మకము చాద్భుత ◆ మానిత మై ధరన్.

చంద్రశ్రీ ౧౬-౧౦౧౭౮

। ∪ ∪ య ∪ ∪ ∪ మ ।।। న ।। ∪ స ∪ । ∪ ర ∪ గ.

క్షమం జంద్రశ్రీతోయమనసర◆గ ల్భానువిశ్రా
మముల్ సంబంధించు న్నరహరి ర◆మాచిత్తచోరా
శమీయామ్యాగారా శమనసహ◆జానాథకృష్ణా
ప్రమత్తశ్రీవ్యాదక్షణదశన ◆ రాధాభుజంగా.

మేదిని (వాణి) ౧౬-౧౧౧౭౪

।।। న । ∪ । జ ∪ ।। భ । ∪ । జ ∪ । ∪ ర ∪ గ.

మృడయతి నజ్భజర్గములు ◆ మేదినీసమాఖ్యన్
దడబడుచుండఁగాఁ దనరు ◆ దంష్ట్రి పద్మనాభా
జడనిధితల్ప నందసుత ◆ సాళ్వరాట్కృతాంతా
కడు హితభక్తి నీకు నతి ◆ గావు మయ్య దేవా.

ఫలసదనము ౧౬-౧౬౩౭౪

।।। న ।।। న ।।। న ।।। న ।। ∪ స ∪ గ.

ననననసగములు ద◆నరఁగ దశవిశ్రాం
తిని ఫలసదనము ల◆తిశయ మగుచొప్పన్
మునిజనహృదయములఁ ◆ బొలుచువానిన్ (?)
గొనబుగ ముదమొదవఁ ◆ గొలిచెద మటంచున్.

అశ్వగతి ౧౬-౨౭౦౭౨

∪ ।। భ ∪ ।। భ ∪ ।। భ ∪ ।। భ ∪ ।। భ ∪ గ.

అందము లైనభకారము ◆ లైదును గాంతము లై
పొంది పదింట విరామము, ◆ బూనినయశ్వగతిం

గందసమానమహోన్నత • గాత్రుని శౌరిని గో
విందునిఁ బ్రస్తుతి సేయఁగ • వేడుక యయ్యెఁ జుమీ.

మదనదర్పణము ౧౬ - ౨౧౮౫౫

U।।భ।।Uస।Uజ।U।Uర।।U।జUగ.

చారుమదనదర్పణంబు భ • స్జర్గమ ల్దగుఁ
మారవిమతవిక్రమంబున • న్మహిం జెలంగు నా
భీరుల యమునాతటంబునం • బ్రియంబుఁ జేసి యా
ధీరవరుఁడు గూడె నంచు భ • క్తి సన్నుతింపఁగా.

గజవిలసితము ౧౬-౩౨౭౨౭

U।।భU।Uర।।।న।।।న।।।నUగ.

బాలసరోజనాభ • వరద తనుమిళితజం, బాల దిగంబరా స • మస్తృణకబళకర లం
బాలక మంగళావ • హా గజవిలసితమున, న్గాలి భ రేఫనాన • నగము లిభవిరమ మై.

వ. సప్తదశచ్ఛందం బగుఅత్యష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదియే డేసియక్షరంబు
లై ౧౩౧౦౭౨ వృత్తంబులు పుట్టె నందు:—

శిఖరిణి ౧౭-౫-౩౩౦

।UU।యUUUమ।। ।న।।Uస।U।।భ। Uలగణము.

భజింతు న్నిత్యంబు న్మునిజనసదా • ప్రార్థనపరుఁ
గజేంద్రార్తిధ్వంసిం గృతకలలనా • గ్రావు నజరుఁ
ద్విజశ్రేష్ఠుల్ మెచ్చ న్యమనస భవల్ • విశ్వవిరతి
ప్రజాతాహ్లాదం బై శిఖరిణి యనా • భాసుర మగున్.

పృథ్వి ౧౭-౩౮౭౫౦

। U । జ । । U స । U । జ । । U స । U U య । U వగణము.

జసల్ జసయవంబు లుష్ణకర • సంఖ్యవిశ్రాంతులుఁ
బొసంగి కవిపుంగవుల్ పలుక • భూమిలోఁ బృథ్వి నా
వసంశయ మగుం గళిందతన • యామనోవల్లభా
ప్రసన్నవదనాంబుజా ధృత • పరశ్వథా మాధవా.

హారిణి ౧౭-౪౬౧౧౨

। । । న । । U స U U U మ U । U ర । । U స । U వగణము.

హారిణి యనువృత్తం బొప్పు న్నాభస్క • రార్తవిరామ మై
సరి నసమరేఫస్వం బై షోడ • శప్రమదాసహా

స్రరమణుఁ దృణావర్తక్రవ్యాద•సంహారు మస్తకో
పరిరుచిరపింఛాచూడుం బీత•వస్త్రు నుతింపఁగా.

### నర్కుటము (కోకిలకాకము) ౧౭-౫౬౨౪౦

IIIన IUIజ UIIభ IUIజ IUIజ IUవగణము.

కొలిచెద నాదిదేవుపద•కోకనదంబులు నేఁ
దొలఁచెదఁ దొంటిబాముసఁ గు•దుర్వ్రుడుపాపములం
దలఁచెద నామధేయ మతి•తత్పరత న్జభజా
వలఁ దగునర్కుటంబునకు • భర్గవిరామములన్.

### మందాక్రాంత ౧౭-౧౮౯౨౯

UUUమ UIIభ IIIన UUIత UUIత UUగగము.

మందాక్రాంత న్గిరిశవిరతు • ల్మభ్నతాగాగణంబుల్
పొందె న్నాందీపునివలన సం•పూర్ణవిద్యాచయంబుల్
బ్రుందించె న్ద్వారుణరణమునం • జాంద్రసాళ్యాదులం జే
యందెం జేరం డడుకులకు నం•దాత్మజుం డంచుఁ జెప్పన్.

### పాలాశదలము (త్వరితగతి) ౧౭-౩౨౭౬౮

III న III న III న III న III న UU గగము.

అదనదనున హరినుతు • లమర ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి•జనులు వచియింపన్
బదునొకఁ డగునెడ యతి • పదిలమునఁ జేరన్
గదియు నగణములయిదు • గగము తుద నొందన్.

### వంశపత్రపతితము ౧౭-౬౪౯౮౩

UIIభ UIUర IIIన UIIభ IIIన I Uవగ.

బాగుగఁ జెప్ప నొప్పు వసుధన్ • భరనభనలగల్
సాగి పినాకివిశ్రమమమున్ • సభలనుఁ గుదురై
రాగిలువంశపత్రపతిత • ల్రణమున వరకు
న్రాగతవంబునం దునియె నం•దతనయుఁ డనినన్.

చంపకకేసరి ౧౨-౪౬౮౫౮

॥ ᑌస । ᑌ । జ ॥ᑌస॥ ᑌస॥ ᑌస । ᑌవగ.

సనకాదియోగినుత • జాంబవతీప్రియ నిర్వికల్ప నమేయ నక్షర వి•భు న్యమళార్జునభంజనుఁ
వనమాలిఁ గృష్ణు మురభంజను నెంతురు వారిజా
సనవిక్రమంబు సజ•సాస్వలు చంపకకేసరిఁ.

వ. అష్టాదశచ్ఛందం బగుధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునెనిమిదియక్షరంబు లై ౨౬౨౧౪౪ వృత్తములు పుట్టె నందు:—

మత్తకోకిల ౧౮-౯ ౩౦౧౯

ᑌ।ᑌర॥ᑌస।ᑌజ।ᑌజ।ᑌ॥భᑌ।ᑌర.

అత్తమిల్లు మహేశవిక్రమ • మార్యసమ్మతి నొప్పఁగా
సత్తులౌ రసజాభరేఫలు • చాకళింపుచు నొందఁగా
మత్తకోకిలవృత్తపద్ధతి • మక్కువం బొనరింపఁగా
హత్తి పూజ యొనర్ప వచ్చు జ•నార్దనాహ్వయు నెప్పుడుఁ.

కుసుమితలతావేల్లిత ౧౮-౩౨౮౭౨

ᑌᑌᑌమᑌᑌ।త।।।న।ᑌᑌయ।ᑌᑌయ।ᑌᑌయ.

వేమా రెన్నంగాఁ గుసుమితలతా•వేల్లిత న్మత్నయాయల్
శ్రీమార్తండక్రాంతియుఁ గుదిరినం • జెన్ను మీఱు న్ధరిత్రిఁ
గామేపల్లీశుం గనకవసనుం • గంజనేత్రుఁ శుభాంగుఁ
గోమద్బాలుం గాలయవనహరుం • గుంజరేంద్రార్తినాశుఁ.

నిశి ౧౮-౨౪౯౪౪

।।।న।।।నᑌ।ᑌరᑌ।ᑌరᑌ।ᑌరᑌ।ᑌర.

ప్రబలు నిశను నార•రారంబుల నత్ని విశ్రాంతియుఁ
గబళితదవపావ•కాపూతనాజీవితాహారి కృ
ష్ణ బలసహజ పారి•జాతాపహారా యదుశ్రేష్ఠ దే
వబలదమనవంద్య • బంహిష్ఠ వార్ష్ణేయ శైనేయకా.

హారనర్తనము ౧౮-౯౦౯౨౧

ᑌ।ᑌర॥ᑌస।ᑌజ।ᑌᑌయᑌ॥భᑌ।ᑌర.

దావపావకఖాది మా•ధవ దాశార్హా•దనుజాంతకా
దేవకీప్రియనంద నా•దివిషద్వంద్యా•ధుర్వసన్నుతా

భావగోచర విశ్వరూ•ప దగు న్వాకుప్రి•వ్వ నవ త్తసం
ఖ్యావిరామము రేఫస•జ్యభ రేఫంబుల్ • హారన త్రనన్.

త్ర్మాహారము ౧౭-౩౦౮౪౧

UUUమ III న IUU య UUI త III నUUUమ.

బాహాబాహిని దమలో • భ్రాంతిల్ దొడ్డ•పగలఁ బోరాడం
గా హాంపీరఁ దగుబుభు•త్మానూనున్ జ•గతిని గూలంగా
నాహా యేసినవరపా•లా రత్నేఘు•యతులు పొందంగా
త్మాహాగంబు మనయత•న్మంబుల్ చెంది • [1]మనును నందం బై.

వ. ఏకోనవింశతిచ్ఛందం బగునతిధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బందొమ్మిదేసి య
క్షరంబు లై ౫౨౪౨౮౮ వృత్తములు పుట్టె నందు:—

శార్దూలవిక్రీడిత ౧౯-౧౪౯౩౩౭

UUUమ IIU స IUI జ IIU సUUIత UUIతUగము.

నీరేజాంచితలోచనాయ హరయే • నీలాంబుదాంగాయ మా
యారాత్రించరఖండనాయ విభవే • హార్యక్షవక్త్రాయ తా
ర్క్ష్యారూఢాయ యటంచుఁ గూర్తురు నిరీ•హా విశ్వవిశ్రాంతి వి
స్తారింప న్మసజ స్తతంబులు గము • న్శార్దూలవిక్రీడితన్.

తరళ ౧౯-౭౫౭౧౪

III న UIIభUIUరIIUసIUIజIUIజUగము.

జలజలోచనుఁ గైటభాంతకు • శంఖచక్రగదాధరున్
గలశజాదిమునీంద్రసేవితుఁ • గాళియాంతకు నచ్యుతున్
బలుకుచోఁ దరళంబు లందుల • భానువిశ్రమపద్ధతిన్
గలియ నభ్రసజాగముల్ సమ•కట్టి చెప్పుదు రుత్తముల్.

మేఘవిస్ఫూర్జితము ౧౯-౧౮౬౫౮౭

IUUయUUUమ III న IIU సUIUరUIUరUగ.

క్షమాలక్ష్మీనాథున్ విదురవరదున్ • జాహ్నవీజాతపాదున్
సమామ్నాయ స్తవ్యున్ గరుడతురగున్ • సామజప్రాణదాతన్
మిము౦ దాఁ జేరొక్కన్న న్సభలఁ దనరు • న్మేఘవిస్ఫూర్జితంబుల్
విమర్శం గూర్పన్ యమ్నసరరగము • ల్విశ్వవిశ్రాంతిచేతన్.

1 కనలు.

చంద్రకళ ౧౯-౧౮౬౫౭౨

∪|∪ర॥∪స॥∪స∪∪|త|∪|జ|∪|జ∪గ.

తానకంబుగఁ జంద్రకళావృ♦ త్తంబు కవు ల్విరచించినన్
వీనులార మనోజ్ఞపదంబుల్ ♦ పేర్చి కపర్ది విరామ మై
కొన వచ్చి రసస్తజజంబుల్ ♦ గంబు దనర్చి కళిందజా
మానినీరమణ స్తవగాథా ♦ మానితరత్నములం దగున్.

భూతిలకము ౧౯-౧౮౬౦౩౯

∪|భ∪॥భ∪|∪ర॥∪స|∪|జ|∪|జ∪గము.

భారసజాగగణంబులుం బఱ♦వంగ భానువిరామవి
స్ఫారత భూతిలకంబు పాండవ♦పక్ష దైవతవృత్త మిం
పార ధరిత్రికిఁ దెచ్చినట్టిమ♦హాత్మ యంచుఁ గవీశ్వరుల్
చారుపదంబులు గూర్చి చెప్పిన ♦ శ్రావ్య మౌ వినువారికిన్.

కవికంఠభూషణము. ౧౯-౧౨౨౯౦౦

॥∪స|∪|జ॥∪స॥∪స॥∪స|∪|జ∪గ.

నవరత్నవిశ్రమము♦నన్ సజసాసజగంబులన్ గవుల్
గవికంఠభూషణము♦గా రచియింతురు మాటిమాటికి
న్నవణిల్లుకబ్బమున ♦ నందకపాణి నుపేంద్రు రుక్మిణీ
ధవు సత్కథాసుధలఁ ♦ దత్పరులైన[1] మహాత్ము లట్లుగాన్.

వ. వింశతిచ్ఛందం బగుకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదేసియక్షరంబు లై ౧౦౪౮౫౭౬ వృత్తములు వుట్టె నందు:—

మత్తేభవిక్రీడిత ౨౦-౩౯౮౬౨౬

॥∪స∪॥భ∪|∪ర|॥న∪∪∪మ|∪∪య|∪వగణము.

మనువిశ్రాంతిని సభ్రినమ్యవములన్ ♦ మత్తేభవిక్రీడితా
హ్వాను వృత్తంబు చెలంగె మానవతులా♦రా వీఁడె యేతెంచె భ
క్తిని గాత్యాయనిఁ గొల్చునాఁడు యమునా♦తీరంబునం బొంది వే
డ్కను మాచీరలు దోఁచుకొన్న వెడదొం♦గం జూచినారా యనన్.

---

1 తవరారునట్లుగాన్.

ఉత్పలమాల ౨౦-౩౫౫౭౯౯

U॥భU।Uర॥।నU॥భU॥భUUర।Uవగణము.

పేరిననేయిదుగ్ధములు ♦ పెర్గును మీఁగడయున్సదా ప్రజా
గారము సొచ్చి త్రాగి వెస♦గంతులు వైచుమురారి నెంచఁ గా
ధారుణి రూఢి కెక్కినవ♦తారవిరామముచే లసద్భర౯
భారలగంబులుం గలయఁ♦బల్కిన నుత్పలమాల చెన్నగు౯.

అంబురుహాము ౨౦-౩౩౨౧౫౧

U॥భU॥భU॥భU॥భU।Uర॥Uస।Uవగము.

చారుతమాలదళాసితవర్ణునిఁ ♦ జక్రహస్తుసనాతను
న్దారితకంసముఖక్షితిపాలకు ♦ నందనందను నవ్యయు౯
శూరకులోద్భవుఁ గైటభభేదిని ♦ జోలి చేసి నుతింప భా
భారసవంబులు విశ్వవిరామముఁ ♦ బల్క నంబురుహం బగు౯.

ఖచరప్లుతము ౨౦-౫౨౩౧౭౬

॥।నU॥భU॥భUUUమ॥Uస॥Uస।Uవగ.

యమునలోఁ జొర నోడిననానా ♦ ప్రాకృతజంతువులం బ్రమో
దమునఁ బ్రోచుటకై కలఁచంగా ♦ దర్పమునం జనుదెంచి ఘో
రముగఁ జుట్టినకాళియు సంహా♦రం బొనరించినకృష్ణ య
*ర్యమవిరామముతోడ నభామ్స్వల్ ♦ రాజిలనా ఖచరప్లుత౯.

ప్రభాకలిత ౨౦-౫౭౨౦౭౮

॥।న।Uజ।Uజ॥భU।Uర॥Uస।Uవగము.

వళి పదమూఁడవయక్షరంబుగ♦వాని కెక్క నజాభరే
ఫలు సలగంబు లమర్చి సొం పొద♦వం బ్రభాకలితాఖ్య మై
చెలు వగువృత్తమునందు సత్కవి♦శేఖరు ల్వినుతింతు రా
జలనిధిమీఁదను బవ్వళించిన♦జాంబవత్యధిపాలువి౯.

వ. ఏకవింశతిచ్ఛందంబగు ప్రకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియొక్క యక్ష
రంబులై ౨౦౯౭౧౫౨ వృత్తంబులు పుట్టె నందు:—

* ర్యమవిరామముతోడ నభామ్స♦స్వల్వైలయు౯ (పూ. ము.) ఇందు యతి తప్పినది; ర్యమవిరామముతోడ నభామ్సస్వల్ ♦ రాజిలనా (ప. ఓ. పె.) ఇందు గణము తప్పినది.

చంపకమాల ౨౧-౭౧౧౬౦౦

|||న|∪|జ∪||భ|∪|జ|∪|జ|∪|జ∪|∪ర.

చపలమనీషతోఁడ నొక ♦ సంయమి వే మొఱ వెట్టుచుండఁగాఁ
గృపను దదీయపుత్త్రిఁ బ్ర ♦ తీక్షించినమేటివిభుండ వంచు నిన్
సపరిగణంబుతో నజభ ♦ జాజలు రేఫముఁ గూర్చి సత్కవుల్
త్రిపురవిభేదనాఖ్యవిర ♦ తిం దగఁ జంపకమాలఁ గొల్తు రా.

వనమంజరి ౨౧-౭౪౪౩౦౪

|||న|∪|జ|∪|జ|∪|జ|∪|జ∪||భ∪|∪ర.

మనువిరతు ల్నజజాజభర ల్వన ♦ మంజరిం గవిశేఖరుల్
దనరఁగ నాజయుఁడు న్విజయుం డను ♦ ద్వారపాలకు లిర్వురు
న్సనకునిశాపము దాఁకి నిశాటు ల ♦ నంగఁ బుట్టి సుపర్వులన్
జెనకినవాంద్రను జంపినకోలన్ను ♦ సింహుని న్వినుతింతు రా.

* స్రగ్ధర ౨౧-౩౦౭౯౯౩

∪∪∪మ∪|∪ర∪||భ|||న|∪∪య|∪∪య|∪∪య.

మానొందున్ స్రగ్ధరాఖ్యన్ ♦ మరభనయయయల్ ♦ మత్తనాగాష్టవిశ్రా
మానూనప్రాప్తలైనన్ ♦ హరిముఖదివిజుల్ ♦ యాతుధానవ్రజంబుల్
సానందాసక్తితోఁ దో ♦ యధికడ నమృతం ♦ బారగింపంగ నచ్చో
మానివ్యాకారతన్ స ♦ మ్మదమువొదలఁ బ ♦ ద్మాధవానందపుత్త్రా!

లాటీవిటము ౨౧-౩౯౪౯౭౧

||∪స||∪స||∪స||∪స∪∪∪మ∪∪|త|∪∪య.

సగణంబులు నాల్గిట మత్యలవి ♦ శ్వశ్రాంతి న్లాటీవిటవృత్తం
బగు నంచుఁ గవీంద్రులు గొల్తురు స ♦ మ్యక్ప్రీతి న్యాచించి యథేచ్ఛం
దగు నేర్పున మూఁడు పదంబులుగాఁ ♦ దైలోక్యంబు [2]గ్గొల్చి సురారుల్
వొగలం బలిదానవుఁ ద్రొక్కినయా ♦ పాట్టిం దిట్ట న్వామనుఁ గృష్ణున్.

మణిమాల ౨౧-౯౬౫౩౫౬

||∪స|∪|జ||∪స|∪|జ||∪స|∪|జ||∪స.

అజమాత్పయోదధిఘృతంబు ♦ లమ్ముచు మురారిఁ బాడి రెలమిన్
వజఁగాఁ దదీయచరణా ♦ త్తనవ్యహృదయారవింద లగుచు

* ఇది (పూ. ము)ల లో లేదు. (ప) లో ఉన్నది. 2 (పూ. ము.)లలో-గొల్వఁగ శూరుల్.

స్వర్ణజసుందరీజనము లొక్క_నాఁడు మణిమాలయందుఁ బొసఁగ
స్నజము త్రిశ్రీవారము సముం బినాకివిరమంబు పొందు దనరన్.

కరిబృంహితము ౨౧-౭౮౨౨౭౧

U।।భ।।।న U।।భ।।।న U।।భ।।।న U।U ర.

మూఁడు భనములు రేఫమును బను మూఁట విరతియు సొంపుగాఁ
గూడుకొనఁ గరిబృంహితము సమకూర్చి వసుమతి మండలా
పీడ మనుకరిబృంహితరవము పెల్లుగఁ బలుకుచుండఁగాఁ
గోడిగపు[1]చిననాఁడు శకటునిఁ గూల్చినహరి నుతించెదన్.

కనకలత ౨౧-౧౦౪౮౫౭౬

।।।న।।।న।।।న।।।న।।।న।।।న।।Uస.

జవమున భగభగ యనుచు వ్రజజనములఁ బొదవినం
దవశిఖి నుడిపినమధుమర నరకదమన యని పే
లవముగఁ బలుమఱు నిరువది లఘువులు గము పదుమూఁ
డవయెడ విరతిఁ బొసఁగిన బెడఁ గడరుఁ గనకలతన్.

వ. ద్వావింశచ్ఛందం బగునాకృతియందుఁ బ్రతిపాదంబున కిరువదిరెండేసి యక్షరం
బులై ౪౧౯౪౩౦౪ వృత్తములు పుట్టినవి:—

మహాస్రగ్ధర ౨౨-౬౦౫౯౮౮

।।Uస UU।త UU।త ।।।న ।।Uస U।Uర U।Uర Uగ.

స్తతనస్రాగ ల్విరించాష్టవిరతులు మహాస్రగ్ధరం జెప్ప నొప్పున్
గ్రతువిఘ్నుం బావహిల్లం బ్రమదమున వ్రజవ్రాతదత్తాన్న [2]మెల్లన్
క్షితిభృద్రూపంబున స్వీక్కిన రుష నమరాగ్రేసరుం డంప మ్రబ్బుల్
ధృతిమై జాల్వాన[2]గూల్పన్ దివిరి కరుణతో [3]ధేనువృద్ధ్యద్రి మోఁచెన్.

భద్రకము ౨౨-౧౯౩౦౭౧౧

U।।భ U।Uర ।।।న U।Uర ।।।న U।Uర ।।।న Uగ.

భంబు రనత్రయంబు గము నొంది భానుయతి భద్రకంబు దనరున్
బంబినపిల్లగోల కరయుగ్మ పాదములఁ బట్టి యూఁది పశువ
ర్గంబు నరణ్యమధ్యమధరిత్రిఁ గాచుసమయంబున న్యమున తీ
రంబున గొల్లలం గలసి యోగిరంబు దినెఁ గృష్ణుఁ డంచుఁ బలుకన్.

---

1 చిననాడుటకుసల. (పె). 2 గూల్పన్ (ఓ); గూల్చన్ (ప) గుర్వన్ (పూ.
ము). 3 ధేనువర్ధాద్రి (పూ.ము).

మానిని ౨౨-౧౭౯౭౫౫౯

◡||భ◡||భ◡||భ◡||భ◡||భ◡||భ◡||భ◡గ.

రాజిలు సప్తభము ల్గము విశ్వవి•రామము మానినియందు భర
ద్వాజముఖప్రమునీశ్వరు లందఱు • దైత్యగురున్ భృగువాక్యమునన్
రా జలనాయకతల్పుని దైవత•రాజు నజస్రము గొల్తురు వి
భ్రాజితమోక్షము చేసుఁ బుణ్యధ•రాస్థలి నంచు వచించుటచేన్.

విచికిలిత ౨౨-౨౦౯౭౧౫౨

|||న|||న|||న|||న|||న|||న|||న◡గ.

ప్రవిలయసమయమునను బద•పడి జలనిధినడుమ స
ద్భువనములు కడుపున నిడుక • భుజగపతిశయనముపై
నవిరళమతిఁ గురుసువరమఁ • దని విచికిలితఁ బదుమూఁ
డవయెడ వడి యిరువదియొక•లఘువు గము బలుక నగున్.

తురగము ౨౨-౧౪౯౦౯౪౪

|||న|||న|||న|||న||◡స|◡|జ|◡|జ◡గ.

ననననసజజగలు తిథివిరమ•ణం బగు స్దురగంబునన్
గనలుచు నగరముపయి విడిసిన • గాంచి తా నొకరుం డెదు
రొక్కని దవులకుఁ గొని చని గిరిగుహఁ • గూర్కొనా ముచికుందుచే
తను యవనునిఁ బొరిగొని తని వసు•ధ న్గణింతురు భూసురుల్.

మద్రకము[1] ౨౨-౧౯౪౭౦౯౫

◡||భ◡|◡ర|||న◡|◡ర||◡స||◡స|||న◡గ.

అధ్వమునందు నడ్డ మయి వా•హనాకృతి నున్న బకాసురు మహా
సాధ్వసదు న్వ్రజార్భకవినా•శనదక్షము వక్త్రముఁ జొచ్చి సురలున్
శ్రాధ్యగు లై నుతింపఁగఁ దదీ•యదేహము వెళ్లినఁ గృష్ణునుతి న
క్రధ్వజమద్విరామము భర•న్రసానగలుం దగుమద్రకమునన్.

వ. త్రయోవింశతిచ్ఛందం బగు వికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదిమూఁడేసి యక్షరంబు లై ౮౩౮౮౬౦౮ వృత్తంబులు పుట్టె నందు:—

1 ఇది (ప) లో మహాస్రగ్ధర తర్వాత ఉన్నది.

కవిరాజవిరాజితము ౨౩-౩౪౯౬౫౧౨౦

IIIన|◡|జ|◡|జ|◡|జ|◡|జ|◡|జ|◡|జ|◡వగణము.

కలయఁగ నొక్కనకారము నాఱుజకారములు న్వమా • గాటముగా
నలరినచో ద్విరదాచలశైలము • తై త్రివిరామము • లంది నిర
ర్గళకవిరాజవిరాజితవృత్తము • రాణ జనార్దన రమ్యకథా
వళులఁ గవీశులు • వర్ణన సేయఁగ • వ్రాలు నజస్రము • వావిరిగన్.

అశ్వలలిత ౨౩-౫౭౬౧౮ ౨౮

IIIన|◡|జ◡||భ|◡|జ◡||భ|◡|జ◡||భ|◡వగ.

సలలితవిశ్వవిశ్రమము నజ్భజ ల్భజభవంబు లశ్వలలితన్
జెలువుగఁ గూర్చి సత్కవులు తల్లి • చిన్నిసముయంబునందున నాలూ
ఖలమునఁ గట్టి వైచినను నిక్కు • [1]కన్దరలి మద్దిచెట్లు ధరణిం
గలపినకృష్ణుఁ గీర్తనము సేయఁ • గాఁ దనరు సర్వకాలము ధరన్.

పద్మనాభము ౨౫-౧౮౯౭౬ ౭

◡◡|త◡◡|త◡◡|త◡◡|త◡◡|త◡◡|త◡◡|త◡◡గగము.

వేమాఱు నప్పద్మనాభంబున న్విశ్వవిశ్రాంతియు న్ప్రస్తుతంబు ల్గగంబుల్
గోమారుగా దేవతాత్రించరుల్ క్షీరకూపారమధ్యంబున న్వేఁపుమీఁదన్
బ్రామంగ మంథాచలం బోపికం గచ్ఛపస్వామి యై మోచె నిక్కృష్ణుఁ డంచున్
గామించి విద్వాంసు లెల్ల న్వచింపంగఁ • గ్రాలు న్ధరిత్రి న్సదా మానితం బై.

మత్తాక్రీడ ౨౩-౮౧౯౭౦౭౧

◡◡◡మ◡◡◡మ◡◡|త|||న|||న|||న|||న|◡వగ.

మత్తాక్రీడాఖ్యం బెం పారు • న్మమతననననవ • మహిత మగుచు ర
త్నాత్తబ్రహ్మాక్రాంతు ల్గ్రం దై • యమరగ రణమున • నధికబలు మదో
న్మత్తుం జాణూరక్రవ్యాదు • న్మనురవనుమఁ బెడ • మరలి పిడికిటన్
సత్తామాత్రం దుర్వాం గూల్చె • న్సకలదివిషదులు • సమతను బొగడన్.

వ. చతుర్వింశతిచ్ఛందం బగుసంకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదినాలుగేసియ
క్షరంబు లై ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టె నందు:—

1 (ప) లో పాఠము ఇందులకు భిన్నముగానున్నది కాని దానిపై గీతలు గీచి యుండుటచే స్పష్టముగాలేదు. మఱికొన్ని తాటాకుపుస్తకములు చూడవలెను.

సరసిజము ౨౪-౮౩౮౮౧౯౩

UUUమ UU|త |UUయ |||న |||న |||న |||న ||Uస.

సంబంధించు న్మత్యలు నానా♦సలు దశనిధియతి ♦ సరసిజమునకున్
గంబూర న్బృందాటవిలోనం ♦ [1]గవిసికొనినసుర♦కరువలిదనుజున్
శంబాధీలం బై తగుముష్టిం ♦ జదిపినయదుపతి♦స్తవములు ననురా
గం బూర న్నోఖిల్లఁగఁ బ్రాంచ♦త్కవివరు లభినుతిఁ ♦ గఱపుదు రవనిన్.

క్రౌంచపదము ౨౪-౪౧౯౩౪౭౯

U||భ UUUమ ||Uస U||భ |||న |||న |||న |UUయ.

పంచమ్కేశుం డిచ్చినభాస్వ♦ద్వరమున మునమున, ♦ బవరము గోరన్
వంచనతో బాణాసురుహ స్త♦వ్రజములు దరిగెను ♦ వడి హరి యంచు
న్బ్రాంచితలీల న్శంకరనంది♦ప్రకటితవిరతులు ♦ భమసభనాన్యల్
క్రౌంచపదీవృత్తమునఁ జె న్నా♦రఁగఁ బలుకుదు రిలఁ ♦ గవివరు లెల్లన్.

తన్వి ౨౪-౪౧౫౫౩౬౭

U||భ UU|త |||న ||Uస U||భ U||భ |||న |UUయ.

దూడలతోఁ గాపరులను గుహలో ♦ దొంగిలిదాచినవిధి నదలింపన్
గూడుక తద్రూపము లయి పసులుం ♦ గోపవధూటులు మూరిపము నొందన్
బాడి వినోదంబులు సలిపినగో♦పాలుఁ డటంచును భతనసభాన్యల్
దాడి గొన న్విశ్వవిరమణముతోఁ ♦ దన్విని జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్.

అష్టమూర్తి ౨౪-౩౬౧౪౫౨౧

UUUమ |||న UU|త ||Uస U|Uర U||భ |U|జ |UUయ.

శ్రీకృష్ణుం గనకవస్త్రుం ♦ జితతృణావర్తదైత్యు ♦ న్సితకుశేశయనాభున్
వైకుంఠు న్వరదు బృందా♦వనచరు న్వాసుదేవు ♦ న్వసుమయుం బరముం బ
ద్మాకాంతు న్నిధినిధానా♦మలవిరామంబు లొప్ప ♦ న్మనతసర్భజయంబుల్
సోకం జెప్పుదురు విద్వాం♦సు లిలలో నష్టమూర్తి♦న్సుప్రతిభు లద్భుతచర్యుల్.

వ. పంచవింశతిచ్ఛందం బగు నతికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియైదేసి యక్షరంబు లై ౩౩౫౫౪౪౩౨ వృత్తంబులు పుట్టె నందు:—

బంధురము ౨౫-౧౪౩౬౮౭౬౮

|||న |||న |||న |||న ||Uస U||భ U||భ U||భ Uగ.

సారిపి నననసభభభగములతో ♦ షోడశసంఖ్యవిరామముతో
బరువడి దినదినమును బుధజను లీ♦బంధురవృత్తమునందు నుతిం

1 గవసు (ప).

తురు హిమకరకుసుమము నొసటను గ•న్నుల్ ఫణిపాగయుఁ దాల్చినయా
దొరజడలనడుమనిలిచిన తెలుపుం ♦ దూకొనువాఁగుకుఁ దండ్రి యనన్.

భాస్కరవిలసితము ౨౫-౮౩౮౧౩౧౧

U II భ III న U I జ I UU య U II భ III న III న II U స U గ.

చెల్లెలి విజయున కిచ్చినవానిం ♦ జేరెడుపృథుకములు దినినవానిన్
గొల్లెతలను వలపించినవానిం ♦ గొల్లకుఁ గొడు కనఁ బరఁగినవానిన్
మల్లుర రణమునఁ జంపినవాని ♦ న్భజ్జయభననసగలు పసమూఁటన్
బల్లిద మగువిరమంబు దలిర్పన్ ♦ భాస్కరవిలసితములు గొనియాడున్.

ధరణీధరగతి ౨౫-౧౬౭౭౭౨౧౬

III న III న III న III న III న III న III న III న U గ.

వసునములు గము ♦ వసువసుయతులు ♦ వల నగు ధరణీధరగతిన్
గస రొదవి సుడి•కరువలిపగిదిఁ ♦ గదవి యదుశిశుచయముతో
§మసలెడునెడ ముర•మథన నినుఁ గొని ♦ మదిని నలరుచు నెగవి యా
కసమున కెగయఁ•గ శకటదనుజా•త్మమఁ గలిపితి వని పలుకన్.

వ. షడ్వింశతిచ్ఛందం బగునుత్కృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదాఱేసి యక్షరంబు లై ౬౭౧౦౮౮౬౪ వృత్తంబులు పుట్టె నందు:—

భుజంగవిజృంభిత ౨౬-౨౩౮౪౮౮౮౯

UUU మ UUU మ UUI త III న III న III న UIU ర IIU స IU వగ.

వ్రాలు ప్రత్నైకాన్తశ్రాంతు•ల్వాహి మమతననరస•వల్ భుజంగవిజృంభితన్
గాళిందీయోషం బెండ్లాడ ♦ క్షరదనుజుఁ దునిమెను శి•ఖావలాంచితపింఛమున్
మాళిం దాల్చె న్బండిం ద్రోచె ♦ న్మఱఁదికి రథముఁ గడపె•మద్దిచెట్లులు రెండు ని
ర్మూలిం చెన్దాలంబుల్గాల్చెన్•ముగుదలు భ్రమయమురళి•మ్రోయఁజేసెవిభుండనన్.

వరాహము ౨౬-౮౩౮౮౬౦౧

UUU మ III న III న III న III న III న III న IIU స UU గగ.

రాజిల్లు న్దశకుధరవి•రతులు మగణ•రసనసగగలు వరాహాఖ్యన్
జేజే లందఱు పొగడ ను•చితుఁ డని తలఁ•చి భృగువు పలుకఁగ నిత్యంబున్
తేజశ్శ్రీ పెరుగఁగ మది•దృఢముగ నిడి•తిమురుచుఁ గొలిచిరి దాశార్హున్
రాజీవాక్షుని నరహరి•రవికులవరు•రఘుపతి బలసహజున్ గృష్ణున్.

§ ఇచ్చటగణభంగము. 1 మద్దిచెట్టులఁగూలిచెన్, దాలంబుల్గాల్చె న్వేగన్ ముగ్ధలు భ్రమయఁగను మురళిదాలిచెన్ సువిభుండనన్.(పూ.ము). 2 ధృవముగ(ప).

మంగళమహాశ్రీ [illegible]

∪॥భ।∪।జ॥∪।స॥న∪॥భ।∪।జ॥∪।స॥ న∪∪గగము.

పొత్తు లేదఁ బాయుటను • బోరుసమయంబునను • బొంగుచుఁ గురూద్వహుల నెల్లన్
దుత్తుమురు సేయఁగఁ గు • మర్చును మనీష నది • దుష్టసమరావనిఁ గిరీటి
క్షత్తకు భజస్న భజ • సానగలు మణ్యాజాల • శ్రాంతులును మంగళమహాశ్రీ
వృత్తములఁ జెన్నలర • నిచ్చిరి సువాసినులు • నిం పడర మంగళమహార్తుల్.

క. పొందుగ నిరువదియా అగు, ఛందములం దుదయమైన • సమవృత్తము లా
నందమునఁ గవులు పొగడెదు, కందువల వచించినాఁడఁ • గామెపలీశా. 178

వ. ఇవి సమవృత్తలక్షణంబు లింక ముఖ్యగౌణవృత్తలక్షణంబు లెఱింగించెద. 179

ముఖ్యగౌణవృత్తలక్షణము.

సీ. సమవృత్తపఙ్క్తి స్వ • స్థానార్ధసమములు స్వస్థానవిషమాఖ్యఁ • జనునవియును
బృథివిపై సమవృత్త • భేదంబు లీమూఁటి కక్షరంబులు సమం • బన్నికాళ్ల
నివి వృత్తముఖ్యంబు • లిఁకఁ బరస్థానార్ధసమవృత్తములు పర • స్థానవిషమ
సంజ్ఞలఁ బద్యము • ల్సర్వపరస్థానవిషమంబులును నివి • విషమవృత్త
తే. భేదములు వీనినాలుగు • పాదములను, సమముగాఁ జూపడవు వర్ణ • సంఖ్య లెచ్చు
కడమ లై యుండు నీమూఁటి • గౌణవృత్త, పద్యములటం డ్రు శ్రీకామె • పల్లినిలయ.

సమవృత్తవివేకము.

గీ. జగతి సమవృత్త మెన్నవ • ఛందమునను, సంభవము నొందె నన్ని య • క్షరము లమరఁ
బదపదంబున హెచ్చును • గొదువ గాక, ప్రాసములు విరామంబులుఁ • బరిఢవింప.

స్వస్థానార్ధసమవివేకము.

ఆ. అక్షరములు సమము • లయ్యె స్వస్థానార్ధ, సమములందు నాల్గు • చరణములను
విషమపదము లొక్క • విధము గణంబులు, సమపదంబు లొక్క • సరిగణములు. 182

క. సగ మొక్కవిధంబునఁ బెఱ, సగ మొక్క తెఱంగు గాఁగ • సమకూర్పఁ దగున్
జగతి నొకకా లొకకరణి, నొగి మూఁడుపదంబు లొక్క • యోజం దనరున్.

తే. సాధుకవికృతగ్రంథసం • జాత మెల్ల, వెదకి సకలోపజాతుల • విచ్చలవిడిఁ
గాళిదాసుఁడు రఘువంశ • కావ్యమునను, జెలఁగి రెండవసర్గలోఁ • జెప్పినాఁడు. 184

వ. అటు గాన స్వస్థానార్ధసమవృత్తంబులం దుపజాతి యనువృత్తము. 185

ఉపజాతివృత్తము.

ఈపాటితో జేసుల • నింద్రవజ్రం, బుపేంద్రవజ్రావ్యయ • మూర్విసర్గం
దాపించినంతం గరు • ణాసముద్రా, జపిష్టలోలా యుపజాతి యయ్యెన్. 186

వ. ఇది పదునొకండవ త్రిష్టుప్ఛందంబునందలి యింద్రవజ్రాచ్ఛాయను బేసిపాదాలును నుపేంద్రవజ్రాఛాయను సరిపాదాలును నడుచును. [1]దీనిపేరే నిశి. 187

మఱియు, వ్యత్యస్తోపజాతి.

తలంబులై బేసి జ♦తజ్జగంబుల్, చాలొప్పసర్లందత♦జల్ గగంబుల్
జలంబులోనిట్లు ♦ సాగినంతన్, వాలారు వ్యత్యస్తము ♦ వాసుదేవా ! 188

వ. ఇది ఉపేంద్రవజ్రచ్ఛాయను బేసిపాదాలును, ఇంద్రవజ్రచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 189

సమోపజాతి.

తాపింఛనీలాంగుఁ బ్ర♦దాకుతల్పున్, గోపాలబాలు న్రవి♦కోటితేజున్
గృపాసముద్రు న్నుతి♦యించెద న్మ,క్త్యపార్థిఁ గాంక్షించి స♦మోపజాతిన్.

వ. ఇంద్రవజ్రాఛాయను మొదలిరెండు పాదములను నుపేంద్రవజ్రాఛాయను గడమ రెండుపాదములను నడుచును. మఱియు, 191

వ్యత్యస్తసమోపజాతి.

తపంబుచేఁ గొల్తు వి♦ధాతృతాతన్, గపాలికోదండవి♦ఖండనాఖ్యున్
గోపీభుజంగున్ ధృత♦గోత్రు సన్నో, త్కోపాయు వ్యత్యస్త స♦మోపజాతిన్. 192

వ. ఇది యుపేంద్రవజ్రాచ్ఛాయను మొదలిరెండు పాదములును నింద్రవజ్రాచ్ఛాయను గడమ రెండుపాదాలును నడుచును. మఱియు, 193

వైపరీత్యోపజాతి.

తాజ ర్గగంబొంట జ♦తజ్జగంబుల్, గజిక్కన మ్మాఁటను♦గంతువేయున్
వ్రజాంగనావల్లభ♦వైపరీత్యో♦పజాతివృత్తంబు స♦భం జెలంగున్. 194

వ. ఇది యింద్రవజ్రాఛాయను మొదలిచరణమున నుపేంద్రవజ్రాఛాయను గడమ మూఁడుచరణములును నడుచును. దీనిపేరే [2]వాతాంగియు, మఱియు నివృత్తమున నే యింద్రవజ్రాచ్ఛాయను ఏదైన నొకచరణమును నుపేంద్రవజ్రాచ్ఛాయను ఏవైన మూఁడుచరణములును జెప్పినను తప్పులేదు. మఱియును, 195

ఉపచిత్ర.

భిదురంచితసావలు ♦ బేసులన్, గాదిలి భాభగ♦గంబులు సర్లన్
గుదురై రసికస్తుతి♦గూడినన్, శ్రీదయితా యుప♦చిత్ర చెలంగున్. 196

1 ఈవాక్యము పూ. ము. లలో లేదు.

2. వ రాంగిని (పూ. ము.); వారాంగి మందు పచ్చును. (చూ. అ. 4. 207)

వ. ఇది త్రిష్టుప్ఛందమునందలి వృత్తిచ్ఛాయను బేసిపాదములను దోదకవృత్తచ్ఛాయను సరిపాదములను నడుచును. మఱియు, 197

## నారీనుతము.

పేరెంబు ల్వారోరి బేసి న్మతాగా, సారంబు సర్ల దత జల్లగంబుల్
ధీరోదాత్తుల్ సన్నుతింపఁ దగు తిర్, నారీనుతం బయ్యె జనార్దనాఖ్యా. 198

వ. ఇది పదునొకొండవ త్రిష్టుప్ఛందస్సునందలి శాలినీవృత్తచ్ఛాయను బేసిపాదములును నింద్రవజ్రాచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 199

## అజితప్రతాపము.

జలజాక్ష! బేసుల సజల్ ససలల్, బలుమయల్ సరి నభజ లొందఁగా
జలజోద్భవాబ్జజవిశాలయతుల్, దళము లైన యజితప్రతాపమా. 200

వ. ఇది పండ్రెండవ జగతీచ్ఛందస్సునందలి ప్రమితాక్షరవృత్తచ్ఛాయను సరిపాదములను బ్రియంవదావృత్తచ్ఛాయను బేసిపాదములను నడుచును. మఱియు, 201

## రతిప్రియము.

బేసి న్నజరగలు పేర్చి సర్ల జబుల్, భసజ్జగల్లదిసినపాదబద్ధ మై
యూసామోద్భవచతురాస్యవిష్ణుఖ్యాతి సన్నుతింపఁదగు రతిప్రియం బనన్.

వ. ఇది పదుమూఁడవ అతిజగతీచ్ఛందస్సునందలి ప్రహర్షిణీవృత్తచ్ఛాయను బేసిపాదములును రుచిరవృత్తచ్ఛాయను సరిపాదములును నడుచును. 203

ఇది స్వస్థానార్థ సమవృత్తిలక్షణం బిఁక స్వస్థానవిషమవృత్తంబు లెట్టి వనిన:—

## స్వస్థానవిషమవృత్తవివేకము.

ఆ. చరణములను వర్ణసంజ్ఞలు దప్పక, నాల్గుపాదములగణములు నాల్గు
విధము లై చెలంగువృత్తముల్ స్వస్థాన, విషమవృత్తసంఖ్య వెలయుచుండు. 204

## ధరణి.

రసపై సచతుష్కము రారసలుల్, నాససల్ మాససల్ నాటిన న్మణితా
పసనగరసపరిపక్వయతు, లార్ సొం పారు న్వాలాయము గా ధరణుల్. 205

వ. ఇది జగతీచ్ఛందస్సునందలి తోటకవృత్తచ్ఛాయను మొదటిపాదమునను గడమ మూఁడుచరణములను గవికల్పితము లై నడుచును. మఱియు, 206

## వారాంగి.

తాజ ల్గయుగ్మంబు జతజ్జగంబుల్, తజాగగంబుల్ మభతల్లగంబుల్
రాజిల్లు నిభేంద్రవిరామయుక్తిన్, వాజిగ్రీవ హారివారాంగి దగున్. 207

వ. ఇది యింద్రవజ్రాచ్ఛాయను మొదటిచరణమునకు నుపేంద్రవజ్రాచ్ఛాయను రెండవచరణమునను గీతాలంబనవృత్తచ్ఛాయను మూడవచరణమునను వాతోర్మివృత్తచ్ఛాయను నాలవచరణమునను నడుచును. మఱియు, 208

అంగజాస్త్రము.

రంగు భమస్గల్ ♦ గ్రాలు మసజ్గల్, పొంగై యున్నగ♦ము గ్రజర్గలో
ప్పంగా నార్త♦వగిరివ శైతే, నంగజాస్త్రప్రకృత్త్య మందగించుక్. 209

వ. ఇది రుక్మవతీఛాయను మొదలిచరణమునను శుద్ధవిరాటిచ్ఛాయను రెండవచరణమునను పణవచ్ఛాయను మూడవచరణమునను మయూరసారిచ్ఛాయను నాల్గవచరణమునను నడుచును. మఱియు, 210

నదీప్రఘోషము.

పోలిమై రారరం♦బుల్ జతత్రంబులుక్
తలంచఁగా యాయతులుక్ ♦ దతజ్రలుక్
విలాసాచలాష్టేభ♦విక్రాంతితోఁదక్
దేలింప నొప్పారు న♦దీప్రఘోషముల్. 211

వ. స్రగ్విణీవృత్తచ్ఛాయను మొదలిచరణమునను హంసశ్రేణిచ్ఛాయను రెండవచరణమునను భుజంగప్రయాతవృత్తచ్ఛాయను మూడవచరణమునను ఇంద్రవంశచ్ఛాయను నాలవచరణమునను నడుచును. 212

ఇది స్వస్థానవిషమవృత్తవివేకం బింకఁ బరస్థానార్ధవిషమవృత్తవివేకం బెఱింగించెద:—

పరస్థానార్ధసమవృత్తవివేకము.

క. మానుగ సమాంఘ్రు లొకగతిఁ, బూనిక విషమాంఘ్రు లొక్క♦పోలికలివు లై
హీనాధిక్యములు పరస్థానార్ధసమంబులందు ♦ సమవిషమములక్. 213

మనోహరవృత్తము.

ప్రేరై నతజజ్వలుఁ ♦ బేసియెడక్, సరులక్ సగణోజ్జ్వలము ♦ సాగిన గం
భీరేభపితామహ♦విక్రమముల్, పెరుగంగ మనోహర♦వృత్తము లౌ. 214

వ. ఇది కలితాంతవృత్తచ్ఛాయను బేసిచరణములును దోటకవృత్తచ్ఛాయను సరిచరణములును నడుచును. 215

కేతుమతి.

జతబేసుల న్స♦జనగముల్, భాతి సరిక్ భరే♦భనగగంబుల్
యతిశైలసంఖ్య ♦ నమరఁగా, నాతతకేతుమ♦త్యభిధ మొప్పక్. 216

### వేగవతి.

సగణత్రయగ♦ల్పను చేసిన్, బాగుగ సర్లను ♦ భత్రిగగంబుల్
వగవిశ్రమ మం♦దమూ నొందన్, వేగవతీసుత♦వృత్తమునందున్. 217

### వియోగిని.

ససజల్ గము♦సాగ చేసులన్, బసస్భ్రల్గము ♦ భాసిలున్ సరిన్
రసశైలవి♦రామసంగతిన్, బొసఁగు న్వియోగిని ♦ భూరమాధిపా. 218

### పరావతి.

ఓలి రజ్రజాంతగంబు♦లుంచి చేసులం, దులన్ జరజ్రగంబులుం [1]గు♦దుర్పరింపన్
గ్రాలుచు న్నిధానదిగ్వి♦రామ మొప్పఁగా, నిలం బరావతీసువృత్త♦మింపుగాంచున్.

### ధృతమధ్య.

బారిగ చేసుల ♦ భాభగగంబుల్, సరుల నజాయులు ♦ సాగఁగ మే ల
య్యారి శిలోచ్చయ ♦ హస్తివిరామో, [2]దారత నొప్పును ♦ దా ధృతమధ్యన్. 220

వ. ఇది దోదకవృత్తచ్ఛాయను బేసిచరణములును తోదకవృత్తచ్ఛాయను సరిచరణములును నడుచును. 221

ఇది పరస్థానార్థసమవృత్తవివేకం బింకఁ బరస్థానవిషమవృత్తవివేకం బెఱింగించెద:—

### పరస్థానవిషమవృత్తవివేకము.

క. దానవహార యొకచరణం, బైనను రెండడుగు లైన ♦ నక్షరగణసం
ధానములను బెఱతెఱ వగు, వీనికిఁ బేరు పరదేశ♦విషమము లయ్యెన్. 222

### శరభక్రీడ.

ఘనాదిత్యక్రాంతి న్యమనసర♦గ ల్మూఁడుకాళ్లన్
గనద్ధాతృక్రాంతి న్మభసయుజ♦గద్వంద్వ మొందన్
దనర్పంగాఁ బౌరాణికకథల♦దాశార్హ వాక్ప్ర
వ్వ నర్హం బై చెన్నార వనిశర♦భక్రీడసంజ్ఞన్.[3] 223

వ. ఇది చంద్రశ్రీచ్ఛాయను బ్రథమచరణమునను విశాలచ్ఛాయను మూఁడుచరణములను నడుచును. 224

---

1 గుదిరింపఁగా (పూ. ము) ఛందోభంగము. 2 ఈచరణము రెండవచరణమువలెలేదు. అన్ని ప్రతులందును ఇది ఇట్లేఉన్నది. 3 ఇందు నాలుగు చరణములును చంద్రశ్రీచ్ఛాయనేఉన్నవి. రెండవచరణము గనద్ధామక్రాంతిన్మభనయుజ♦గద్వంద్వ మొందన్ (పూ. ము).

### శ్రీరమణము.

ఆది భమసగ•ల్గాత్రిన నాపై, గాదిలి భాభగ•గంబులు మూఁటన్
బాముకొనం గవి•పల్కునదో లక్ష్మీదయితా ధర • శ్రీరమణం బౌ. 225

వ. ఇది రుగ్మవతీచ్ఛాయను దొలిచరణమును దోదకచ్ఛాయను మూఁడుచరణములును న
డుచును. 226

### రథగమనమనోహరము.

గ్రథితనయుగరల•గంబులుం బొసంగం, బ్రథమయతి యుచతుర్థ•పాదముల్యాచింపన్
విధివశయతు లొంద•వింతగా నఖాద్యల్, రథగమనమనోహ•రం బగున్ ధరిత్రిన్.

ఇది పరస్థానవిషమవృత్తవివేకం బింక సర్వపరస్థానవిషమవృత్తవివేకం బెట్టి దనిన:—

### సర్వపరస్థానవిషమవృత్తవివేకము.

క. ఉర్విని నాలుగుపదములఁ, బర్వినగణములను వర్ణ•పఙ్క్తిగణనయున్
సర్వము విపరీతం బగు, సర్వపరస్థానవిషమ•సంజ్ఞ లను హరీ. 228

### వీణారచనము.

దారిఁ దయసాగ ల్మితి•జ్నభగాలు, న్వారించి తజ న్భసలు భ•జాజనగంబుల్
జేర న్మణిదిగ్గశశి•శేఖరవలి వీణారచన ధరఁ దెలఁగును • నారదవినుతా. 229

### [1]ఉద్ధతము.

ఆసవార సు•ద్ధత మన్యో, న్మరి సజయులున్ • నసజ్గలున్
జానుభనజగలు • సజ్యులున్, ధర షణ్మహేంద్ర•గజ • ధాత్రియతిన్. 230

### మధుర.

వెసమధురాఖ్యమా • విన్నజారగల్ నా
రసలగములు మీద • రాగనయ్యుయల్
నసజజజగ లొందన్ • దంతిరత్నాజది[2]
క్ప్రసరవిరమంబు జెంది•రసందనరారజా! 231

వ. ఇది ప్రభాతచ్ఛాయను మొదటిచరణమునను అపరాజితచ్ఛాయను రెండవచరణము
నను మాలినీఛాయను మూఁడవచరణమునను నడుచును. నాలవచరణముకవికల్పితము.

### మణిదీపిక.

గురుపితామహముఖ్యులఁ గినిసి • ఘోరరణములోఁ
దెరలిచె నరుఁ డని పలుక రత్న•దీపిక ల్దనరును న

1 ఉద్గతము (వ్రా. ము). 2 ఛందోభంగము-దీనరగణము యగణమై యుండవలెను.

క్షరనభభ్నభస ల్నానసజ•క్కౌరభసలు నభర్భనసనసలు
స్భరసజాగలు భూపతు ల్వినఁ•భానువిక్రమయుక్తితోఁ. 233

ఉ. ఈసమవృత్తరాజి సుద•ఱుంచుమి రామములు న్గణంబులుం
బ్రాసము లెల్లఁ దప్పక న•మర్చి వచించిన నైమతో వ లై
భాసిలు వృత్తపద్యము ల•పారము లై విషమాహ్వయంబు లై
వాసికి నెక్కు శిష్టజన•పాలన దుష్టనిశాటచాలనా. 234

ఇది పంచవిధవృత్తవివేకం బింక వైతాళీయజాతివృత్తంబు లెఱింగించెద:—

మ. ప్రకటింతు న్దర దక్షిణాంతికయు నౌ•పచ్ఛాందసంబుం బ్రవ
ర్తక యాపాతలికాపరాంతికలు వై•తాళీయము న్జారుహా
సిక ప్రాచ్యంబు నుదీచ్యవృత్తి యనఁగాఁ • జెన్నారువృత్తంబు లిం
దుకులశ్రేష్ఠ యనేకము ల్గలుగు నం•దుం గొన్ని వాక్రుచ్చెదన్. 235

క. ఖ్యాతిగను రగడలందును, వైతాళీయాఖ్యవృత్త•వారములందున్
బీతాంబరగురువునను, బ్రీతిగఁ గృతుల న్లఘువులు • రెండేసి యగున్. 236

దక్షిణాంతిక.

ఊరుసాజగ • లుండు చేసులన్, సరులం దూకొను • సభ్రవంబులున్
దార లేడిటఁ • దొమ్మిదింట రా, ధరలోఁ జెన్నగు•దక్షిణాంతికల్. 237

ఔపచ్ఛాందసము.

ఇమిడి సలము•లేడు తొమ్మిదింటన్, సమకూఱు న్యతి•షడ్గ రేఫయుంబుల్
సమత న్వసుల•సమా రేఫయుంబుల్, క్షమలో నౌప•చ్ఛాందసంబు మిందున్. 238

ప్రవర్తక (వర్తక).

స్థిర చేసి ను•దీచ్యవృత్తియున్, బరఁగు న్సర్గను • బ్రాచ్యవృత్తియున్
గిరిమణియతి•కీలితంబుగన్, బరముఁ గొల్పఁ బ్ర•వర్తకాఖ్య వహా. 239

ఆపాతలిక.

లము లాఱు వలున్భగగంబుల్, లము లెనిమిదిటికడన్భగగంబుల్
క్షమ గిరినవ•క్రాంతులుం దగున్, బ్రమథితమురయా•పాతలికాఖ్యల్. 240

పరాంతిక.

ఇలవర్తక•వృత్తరీతితోఁ, దుల రైపాదచ•తుష్టయంబులన్
బలసినయది • పద్మనాభ చెన్నలరుం గృతులఁ బ•రాంతికాఖ్య చే. 241

### వైతాలీయము.

ఋతులఘువులు ♦ రేఫవంబులుఁ, ధృతవసులఘువులు ♦ రేఫవంబులుఁ
జత సమకొన ♦ సారసాక్ష హా, లితశుక వైతా♦లీయవృత్తమా. 242

### చారుహాసిక.

[1]ప్రమదమునను ♦ వర్ణకాఖ్యవృ, త్తముచందంబున ♦ ధాత్రి సత్కవుల్
సమకూర్చిన♦శార్ఙ్గకార్ముకా, సమత న్మీఱును ♦ జారుహాసికల్. 243

### ప్రాచ్యవృత్తి.

తొలి నేడిటఁ ♦ దొమ్మిదింట క్రాం, తులు పదునాలుగు♦దూఱు బేసులం
దులఁ బదాఱు♦లొంగలించు స్వర్ణలలి న్మాధవ♦ప్రాచ్యవృత్తి యగా. 244

### ఉదీచ్యవృత్తి.

తమ కిర వగు♦దక్షిణాంతికా,ఖ్యము తేజంబున ♦ నందగించు మే
లిమికృతులఁ గ♦డిందివేలుపా,తిమురు ధాత్రి ను♦దీచ్యవృత్తికల్. 245

ఇది వైతాలీయజాతివృత్తవివేకం బింక మాలికావృత్తవివేకంబు లెఱింగించెద:—

### మాలికావృత్తవివేకము.

తే. మాలికావృత్తము లనంగ ♦ మఱియు నైదు
దనరు నిరువదియాఱు ఛం♦దముల మించి
యల లయగ్రాహి లయవిభా♦తి లయహారి
గదసమాజ త్రిభంగియు దండ♦కంబు లనఁగ. 246

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదియక్కరములపద♦ములయంఘ్రులు నా
ల్గొప్పయతిప్రాసంబులు, గుప్ప లయగ్రాహి యనఁగఁ ♦ గొమరొందు హరీ. 247

### లయగ్రాహి.

ఇం బడరఁగా భజసన♦నభంబులతుద న్భజసన♦నంబులపదంపడి భ♦యంబులు లయగ్రా
హింబరఁగు ప్రాసవిర♦మంబునలు మాఱుగుదు♦రంబటుకవీశులుల♦రంబుగ వచింప న్
నంబరము గా వలసి♦తొంబగలి దానవక♦దంబము సహాయముగఁ♦బంచి త్రిదశు ల్దు
గ్ధాంబునిధి ద్రచ్చి యమృ♦తంబు గొనఁజాలఁ సమ♦యంబు దొరకించితి ము♦దంబున
ముకుందా. 248

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదినాల్గర్ణముపద♦ముతదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్ప లయవిభాతి యనఁగఁ ♦ గొమరొందు హరీ. 249

1 ప్రథమ (పూ. ము.) ప్రాసభంగము.

లయవిభాతి.

పెనిమిటులు భార్యలును♦దనయులను గాంచిరటె♦మనమలర దొడ్డతప♦మునవలదశ
స్యం,దనుడు షుతికౌసలియుఁ♦దనకడుపులోపల భు♦వనము లఖిలంబు నిడు♦కొనిన
కొడుకు,ప్రామునవినసనద్వయము♦వెనుకనసగంబులును♦జొనిపియతులుండునెడ♦లవ
లుమలు ప్రాసం,బునిలిపి కవీశ్వరులు♦మును లయవిభాతి నిటు♦నినువినుతి సేయుదురు♦
వనజదళనేత్రా. 250

క. ముప్పదితొమ్మిదిమాత్రలు, ముప్పదియేడర్ణముపద♦ముతదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్పిన లయహారి యనఁగఁ ♦ గొమరొందు హరీ. 251

లయహారి.

నగణములుపదునొకడు♦సగణమునుగురువునిడి♦మిగులనలుమలుయతులు♦దగులులయ
హారిన్, బెగడిశతధృతిపరిప♦రిగతుల మెఱయిడినమ♦రిగిర్భుషతనువుఁబొదివి♦నిగిడి
చనియంతన్, నిగమములు గొనివెసను♦జగము లద్రువఁబఱచి యొ♦డిగికడపలిజడధి
ము♦నిగిననభియాతిన్, బెగడుచునొడిసికరిచి♦తెగఁగొనినతురగగళుఁ♦డగుహరివనఁగ
సుకవు♦లగణుతిచెలంగన్. 252

క. ఇది నేత్రాంబుధిలము ముప్పదినాలుగువర్ణములను ♦ బాదం బగుఁ ద
త్పదచాతుర్థికములచే, నొదవుఁ ద్రిభంగి యనువృత్తి ♦ ముర్వ్యరలోనన్. 253

త్రిభంగివృత్తము.

వినుపక[1]సుకవులు♦రసఁబ్రతిపదమున ♦హాసగగమూఁడొకతిరై మతివేఱైమూఁడొక
తిరై, రసనగణములును♦ససభసగములును♦పొసఁగినషద్యతిసంగ్రణతింగింజెల్లుఁద్రి
భంగిన్, మసలెడువ్రజమున♦దుసికిలి మధురకుఁ♦గసికిసమృద్ధశుభాంగిందగుభంగిం
జేరిత్రిభంగిన్, వెసమనిచిననవ♦బిసరుహనయనయ♦ని సభలవేడ్కఁగురింతున్ విను
తింతున్ నిచ్చలుఁగాంతున్. 254

క. ఇదినియమము లేనిమహా, పథమునఁ గావలసినంత ♦ [2]పక్కాణింపన్
గొద లేక నమరు దండక, ముదధీంద్రశయాన తావ♦కోత్తమనుతులన్. 255

దండకము.

విద్వాంసు లెల్లన్ హకారంబె కాని నకారంబె కాని సకారంబె కాని వచిం
పం దగున్మందుగా నిందుఁ గాదేని యాదిం దకారంబు గల్పించి యామీఁది
వెల్లం దకారంబులే మెండుగా నిచ్చకు న్వచ్చునందాఁకనిర్మించి గుర్వంతముం జేసిన
న్దండకం బంద్రుభక్తౌనుయాయి భుజంగేంద్రశాయీ పయస్త్రక్రదధ్యాదిక స్త్రీయి

1 సుపలురస (పూ. ము). ఛందోభంగము. 2 పఖ్యాణింపన్ (ప); వఖ్యాణింపన్ (ఓ).

నైర్మల్యతాపింఛగుచ్ఛచ్ఛవిస్వచ్ఛమాయూరపింఛావచూడాసదాపూతబృందాట
వీ మధ్యరథ్యాసమారాధ్యతథ్యార్భకక్రీడహేమేక్షణా ఖర్వదోర్గర్వసంభూతస్వ
ర్వైరరాభారనిర్వాహకార్ధాంగితక్రోడ చండప్రభామండితానేకమార్తాండకోటి
ప్రతీకాశ నానావిధస్తోకలోకేశ వైకుంఠసంవేశ ఘోషాంగనాలోల కాదంబిని
నీల గోపాలబాలా నమస్తే పునస్తే నమః. 256

క. దండిగ నేకపదంబున, నుండెడివిన్ నాల్గుమగుల • నుండెడివిన్ వే
దండావన దండకముల, పిండువు దనరారుఁ జండ•వృష్ట్యాదికముల్. 257

దండకము. ధూర్తుల్ నకారంబులు న్రెంటిపై సప్తరేఫంబులుం గూర్చినం జండవృష్ట్యా
ఖ్య మయ్యె న్నకారంబులు న్రెంటిపై నష్టరేఫంబులుం గూర్ప నర్ణాఖ్య మయ్యె
న్నకారంబులు న్రెంటిపై రత్నసంఖ్యాకరేఫంబులుం గూర్చిన [1]న్నర్ణవం బయ్యె
నోలి న్నకారంబులు న్రెంటిమీఁదం దశఖ్యాతరేఫంబులుం జెప్పినన్ వ్యాళ
మయ్యె న్నకారంబులు న్రెంటిపై రుద్రసంఖ్యాకరేఫంబులు న్నిల్ప జీమూత మయ్యె
న్నకారంబులు న్రెంటిపై నొప్పఁ బండ్రెండు రేఫంబులుం జెంది లీలాకరం బయ్యెఁ
బేర్మి న్నకారంబులు న్రెంటిపై మించు పద్మూఁడు రేఫంబులు న్నంత నుద్దామ
మయ్యె న్నకారంబులు న్రెంటిపై రూఢిఁ బద్నాల్గు రేఫంబుల న్శంఖమన్దండకం
బయ్యె నీరీతితోడ న్నకారంబులు న్రెంటితర్వాత నేడాదిగాఁ గారకారంబు లొప్పా
రఁగా నంఘ్రి నొక్కొక్క టెక్కించి కావించినం జండవృష్ట్యాది నానాలసద్దండ
కంబుల్ ప్రసాళించుఁ గాకుండె నాల్గంఘ్రులుం జేయఁగా వచ్చు [2]నీరీతి నేకోన
సాహస్రపర్యంతముం గూర్చి యిచ్ఛావిధిం జెప్పఁగా వచ్చు గాంతంబుగా రాధికా
జార శ్రీరుక్మిణీమానచోరా సుదంతాసునాథా కళిందాత్మజానాథ వాఃకేళికాసక్త
గోపీజనోత్సృష్టవస్త్రాపహారాశుకాస్యోక్తవాక్యామృతాంభోధిచంద్రోదయా
సాంద్రదేవా నమస్తే పునస్తే నమః. 258

జాత్యుపజాతినామములు.

క. జాతులు నుపజాతులు నన, భూతలమున రెండు భేద•ములు జాతులలో
జాతులు కందాదిక ముప, జాతులు గీతాదికములు • సరసిజనయనా. 259

సీ. కందభేదము లాఱు • గాక నుత్సాహంబు తరువోజ మధ్యమా•క్కరలు నైదు
దీపించుమంజరీ•ద్విపదత్రిపదచతుష్పదపంచపాదిష•ట్పదవిధములు
తొమ్మిదివిధముల•తో నొప్పరగడలు కళికలు నుత్కళి•కలును గూడ
జాతులు నవవిధ•గీతంబులును సీసపత్రకంబును నుప•జాతు లయ్యె

1 న్నర్ష్ణవం (పు.ము.). 2 నీతీరు (ప).

తే. ననుచు నన్నయభట్టు భీ•మనయుఁ బెద్ద
సచివుఁడును మూర్తి తాత[1]నా•జులు ననంత
మంత్రియునుఁ దిమ్మరాజు ని•మ్మాడ్కిఁ జెప్పి
రందముగఁ దాము చేసిన•ఛందములను. 260

జాత్యుపజాతినిరూపణము.

క. గురులఘువులలో నెయ్యది
మురసంహార ప్రథమపాద•ముఖమున నిలిచెన్
ధర నుపజాతులు దక్కఁగఁ
బరఁగ నిలుచు నవియె నాల్గు•పదములమొదలన్. 261

మ. ధరణిన్ జాతుల కాదివర్ణ మొకఁడే•తప్పంగరా దెల్లెడన్
హరి తజ్జాతిగణంబులైన సరి యి•ట్లైనఁ గావచ్చు సుం
దరధారీ యుపజాతులం బ్రథమవ•ర్ణంబు న్యథేచ్ఛంబుగా
సారదిం జెప్పఁగ వచ్చుఁ బ్రాసములు ని•ల్చు న్వర్ణకై యొక్కచోన్. 262

క. తెలియఁగ వినుమీ కామే, పలినామగ్రామధామ • ప్రస్తుతపద్యం
బులు గీతకందసీసా, దులు విరతిగణనియమములతో• వివరింతున్. 263

క. గురులఘువుల పేరిటియ•క్షరములు నష్టగణనామ•కము లగులిపులన్
సురరిపుగర్వతమోభా•స్కర దీర్ఘము లైన రెండు•గా నెన్నఁబడున్. 264

కందషట్కాభిధానంబులు.

గీ. పరఁగఁ గందము పథ్యయు • మరి విపులయుఁ
జపలయును ముఖచపలయు • జఘనచపల
లనఁగ గందపద్యంబు లీ•యాఱువిధము
లఖిలసుకవికృతులలోన • నలరుచుండు. 265

సీ. నలగగభజసగ•ణంబు లేను నె కాని కందంబునకు నొందు•గణము సారదు
[2]పీఁటిలోపల నొక•మూఁటిచే వడి లేనిహీనపాదము ముందుఁ • గానఁబడును
దరువాత దీర్ఘపా•దము పంచగణములఁ దగుదాని మూఁడవ•తావునందు
నలజలు దక్కంగఁ•గలయ వామీఁద నే యతి దాఁకునిజపదా•ద్యక్షరంబు
తే. తుదినిగాసలు దక్కంగఁ • గదియ దొకటి, కొం చెపడుగుల బేసుల • గొప్ప కాల
సరుల జగణంబు గూడదీ•చరణయుగము, భువిని సగమయ్యె రెట్టింపఁ•బూర్ణమయ్యె.

1 నౌజ్యు (మ). 2 వ్రాతప్రతులన్నిటిలో 'పీఁటి' అనియేయున్నది.

ఇది సమస్తప్రబంధములందుఁ జెప్పెడుసహజకందపద్యలక్షణము:—

పథ్య.

ధరలోఁ బథ్యాకందము, హరి యగు నాఱవయెడ నల ♦ మాఱిటికై
విరతియుఁ గూడఁగ మూఁటను, నెరయుఁ జతుర్గణములు గము ♦ నిలిచినచోన్.

విపుల.

క్షమ వేవిళ్లాలు సమసా, దములోఁ జొర శబ్ద మొకటి ♦ తనరింపఁగన్
సమధికపథ్యాకందము, గమనిక విపుల యన నలరు ♦ కంద మగున్. 268

చపల.

[1]సమపదముల మొదలం జగ, ణము గడయుడుగునను ద్విగ ♦ ణలఘువులై
[2]సమకొను విరతియు పదిరేన్, అమల మగుకంద చప ♦ లకు నమరున్. 269

ముఖచపల.

స్థిరఁ జపలాకందమువై, ఖరిన్ మొదలియుడుగు చెప్పఁ ♦ గఁ గవులు పె
ట్టిరి ముఖచపల యనెడుపే, రరిదిగ వైకుంఠ వరద ♦ యఘుజైత్రా. 270

జఘనచపలాకందము.

క్షమఁ బథ్యరీతిఁ బూర్వా, ర్ధము చపలాకందము క్రియఁ ♦ దగు నపరా
ర్ధము జఘనచపలకు ముకుం, ద్ర మానసమరాళ ♦ దాశార్హా. 271

క. గురువొకటి రెండులఘువులు, సరియైనకతమున వృత్త ♦ చయములఁ దక్కన్
బెరజాత్యుపజాతులు వి, బ్బరముగ నెవ్వైన నిలుప ♦ వచ్చున్ గృతులన్. 272

ఉత్సాహాలక్షణము.

[3]ఈశహ మీఱ సూర్యగణము ♦ లేడు గాంత మైన ను
త్సాహవృత్త మనఁగఁ గృతులఁ ♦ జాగుచుండు సత్కవి
వ్యూహనుతులు గాంచి కృష్ణుఁ ♦ డొడిసి కాళ్లు వట్టి పెన్
ద్రోహి చావు మనుచు ఖరునిఁ ♦ ద్రోచెఁ గాళ్లు మీఁదుగాన్. 273

తరువోజ.

శతమఖత్రితయంబు ♦ జలజాప్తుఁ డొకఁడు, శతమఖత్రయి మీఁదఁ ♦ జనువిశ్రమంబు
ప్రతిభ నీయడుగులో ♦ ప్పఁగ రెండుగూర్పఁ, బ్రతిమీఱ నొక్కొక్క ♦ పాదమై తనరుఁ

1 సమపదముల మొదలం జగ, ణముగడపాదమునకు ద్విగ ♦ ణలఘువులై (ప.ఓ.). ఇందు రెండవపాదమున మొదటిగణము జగణముకాదు. 2 సమకొనుయతియాఱవయది, లమకామునకంద్ల చప ♦ లకునమరున్ (పూ.ము). 3 ఈశహా కారశక్ర (ప.ఓ.).

జతురంఘ్రు లీరీతి • జత గూర్చి సుకవి చతురవాచారూఢి • జలజాతునుతులఁ
గృతులందుఁ దరువోజ • పేరోజ నెసఁగఁ గృతకృత్యుఁ డై చెప్పు • క్షితి నెల్లసభల.

పంచవిధాక్కరంబు లెట్టివనిన:—

క. మధురమన పురందరధా, మధిచంద్రగణాలిచే త్కమ మహామధ్యా
మధురాంతరాల్పపూర్వ, గ్రథితాక్కర లైదు దనరు • గ్రంథములందున్. 275

। సూ + 5 ఇం + 1 చం · మహాక్కర.

నూరుఁ డొకఁడును మున్నుగాఁ దర్వాత • సుత్రాము లేవురు పిఱుఁద నొక్క
తారకేశుండుఁ జత యైన నిట్టిస • ప్తగణంబు లొక్కపాదంబునకుఁ
జేరు రెండవచోట నాలవచోటఁ • జిత్రభానుగణంబు గదియుచుండు
నోరసిలు నాలవగణంబుపై శ్రాంతి • యుత్పలాంగ మహాక్కరంబునకు. 276

మధ్యాక్కర.

మునుపుగాఁ బ్రాసంబు గూర్చి • మూఁటిపై విరమంబు నిల్పి
చన నింద్రయుగళంబుమీఁద • జలజాప్తు నొక్కనిఁ జేర్చి
యినుమడించిన నాఱుగణము • లెనసిన నొక్కపాదంబు
దనర వక్కాణించినంతఁ • దగు నిట్లు మధ్యాక్కరంబు. 277

మధురాక్కర. । సూ + 3 ఇం + 1 చం

మురనిశాటేంద్రసంహార • మూఁటిపై విరతు లుంచి
తరణిశక్రత్రయంబు సు • ధామయూఖునితోఁ గూర్చి
వరుసతో నేనుగణముల • పాద మొక్కటి యొనర్చి
దొరలఁ జెప్పిన నొప్పుఁ గృ • తుల మధురాక్కరంబు. 278

* అంతరాక్కర. । సూ + 2 ఇం + 1 చం.

[1]భానుఁ డిద్దఱాదిత్య • పతులు చంద్రుండు
పూని నాలుగుచరణ • ములఁ ద్రిగణాంత
మైనవర్ణంబు విరతి • నంతరాక్కరంబు
భానశీతాంశునేత్ర • పద్మాకళత్ర. 279

1 భానుఁ డిద్ద రాదిత్య • పతులు తమిస్రాపతియు, జానుమీఱ నీనాలుగు • చరణములకు త్రిగణాంత, మైనవర్ణంబువిరతి • నంతరాక్కరంబు, భానుశీతాంశునేత్ర • పద్మాకళత్ర (ప. ఓ.). *భానుఁ డిద్దఱాదిత్య • పతులు చంద్రుండు, పూని నాలుగు చరణ • ములఁ ద్రిగణాంత, మైనవర్ణంబువిరతి • నంతరాక్కరంబు, భానుశీతాంశునేత్ర • పద్మాకళత్ర. ఛందోభంగము లేకుండ నిట్లు సవరణ చేయనగు నేమో ?

### అల్పాక్కర.

విరమంబు రెంటిపై ♦ విస్తరిల్లి, సురపు లిద్దఱు నొక్క ♦ సోముండు రాఁ
జరణ మొప్పాఁటిచే ♦ సాగి యొప్పు, పాంసపర్యంక యు ♦ ల్పాక్కరంబు. 280

### మంజరి, మంజరి.

తుద మొదళ్లను [1]నంటి ♦ మూఁడు శబ్దంబు, ఇక్షించి యతి మాఱు ♦ ప్రాసంబు లిడక
ప్రాసంబులేనిద్వి ♦ పద యై చెలంగఁ, బ్రాసంబుతు నలంమఁ ♦ బదిలంబు చేసి
[2](సాగింపఁగాఁ జాల ♦ సత్కవీశ్వరులు, మోదంబు పెంపార ♦ భూమిలోపలను
బద్మాక్షుఁ డెప్రును చే ♦ పట్టు మంజరుల, చందాన నలరారు ♦ జగతి మంజరులు.) 281

### ద్విపద.

సురపతిత్రితయంబు ♦ సూర్యుఁ డొక్కండు
విరమంబు రెంటిపై ♦ వెలయు నొక్కటికి
క్షితిఁ దగ నిరెంటి ♦ చే నొప్పు ద్విపద
మితి లేక చెప్పిన ♦ మే లంద్రు కవులు. 282

### త్రిపద.

తొలుతను నల్వు రిం ♦ ద్రులు రెంట మూఁటను
బలభిద్ద్వయంబును రవియు ♦ వళి లేక నలరారుఁ ద్రిపద. 283

### చతుష్పద.

జలజాసనవిశ్రమ ♦ సంయుతమై, లలి షోడశమిత ♦ లఘువులతోడన్
గలసి చతుష్పద ♦ గతులను ధరలోన్, జెలు వగుఁ జౌపద ♦ సేవకసులభా. 284

### వితాళచతుష్పద.

[3]భానుయుగము పై ♦ పయి నవల నిం, పూన మణివిరతి ♦ నొంది ధరలో
జా నలరుఁ జతు ♦ ష్పదవితాళా, ఖ్యానమున వినా ♦ యకతురంగా. 285

### కర్ణాటచతుష్పద.

మొగిఁ బంచలఘుగణం ♦ బులు మూఁడు రవియుఁ
దగుతుదఁ బ్రాసంబు ♦ దాఁక రెంటిపయి
నగువిశ్రమమ్ము క ♦ ర్ణాటచౌపద యొ
సఁగుఁ గృతుల సత్కవుల ♦ సమ్మతముతోడ. 286

---

1 నంటితూఁకు (ప); నంటుతూఁకు (ఓ.). 2 ఈరెండుచరణములు వ్రాఁతపుస్తకములందు లేవు. పూ. ము. లలో 'బదిలంబుచేసి' తర్వాత కనఁబడుచున్నది. 3 ఈపాఠము పూ. ము. లోనిది (ప. ఓ.)లలో 'భానుగణయుగముపయినవలతిం' అనియున్నది. అర్థము విచార్యము.

పంచపద.

క. ఆది సమవృత్తములలోఁ, బైవంఘ్రుల నెద్ది యైన ♦ నార్యులు వలుకన్
బాదుకొని కృతులలోపల, నాదరమునఁ బంచపాది ♦ యనఁగా నలరున్. 287

ఉ. ధన్య సుశీల యన్వనిత ♦ తత్పరత న్నదియోద్ధువందు స
త్కన్యలు సేయుసువ్రతము ♦ తాసును వేడుక నాచరించి స
న్మాన్యత గట్టినట్టినవ♦మండితతోరమనూయ చేసి పె
న్దైన్యము నొందితౌవల వి♦ధాత్మకృతంబున సంచరించుకొం
డిన్యమహామునీశ్వరుఁ గ♦డిందిగఁ బ్రోచినరుక్మిణీశ్వరా. 288

షట్పద. 6 ఇం + 1 చం.

ప్రాసము లుమ్మాఱు ♦ వాసవు లాగ్గురి♦పై సుధా దీధితితో నిర్యతి
భాసిల్లఁగాఁ బాద ♦ మీసూటితో నాల్గుఁ ♦ జేసిన కృతులందు షట్పదాఖ్య. 289

నవవిధరగడలు.

వ. మఱియు వైతాళీయభేదంబు లైనరగడ లనేకంబులు గల వందుఁ బ్రసిద్ధంబులైన హయప్రచారాదినవవిధంబులు ప్రబంధంబుల వర్తిల్లు నవి యెయ్యవి యనిన. 290

క. నరసఖ హయప్రచారము, వరుసఁ దురగవల్గనము వి♦జయమంగళమున్ (?)
ద్విరదగతి విజయభద్ర, మ్మధురహరి హరిణప్లుతగతులు ♦ నొరలుం గృతులన్. 291

క. ఆద్యంతప్రాసంబు ల,భేద్యంబులు రెంటరెంట ♦ బెనిచి పదంబుల్
హృద్యంబులు గూర్చిన నన,వద్యంబులు రగడ లెల్ల ♦ వాలుం గృతులన్. 292

క. కొద లేనినైపుణులఁ జొ,పద చేయుత్సాహవృత్త♦పదయుగ్మముచేఁ
దుద నాదిని బ్రాసంబుల, వదలక విరచింప వలయుఁ ♦ బ్రాజ్ఞులు రగడల్. 293

1 హయప్రచారము.

ఋతువిరామ ♦ మినులు నల్వు, రతుక నొక్క♦యంఘ్రి చెల్వు
దనర హయతఁ ♦ దార్క్ష్యుఁ డంచు, దనుజహరణ♦దక్షుఁ డంచు
మును శుకాది♦మునులు వొగడ, జను హయప్ర♦చారరగడ. 294

2 తురగవల్గనము.

ఇరవుల న్హయప్రచార ♦ మినుమడించి కృతులఁ జెప్ప
దుర విదూరితాగ్నివరణ ♦ తురగవల్గనాఖ్య యొప్పు. 295

3 విజయమంగళము.

తురగవల్గనంబు రెంటి♦తోడ విజయమంగళంబు
ధూర్తకంసతూలదహన ♦ తుహినహీరసదృశకీర్తి

పరఁగ దుగ్ధసింధుమధ్య • భాసురాంతరీపవర్తి
వారివాహసదృశమూర్తి • భక్తజనహృదబ్జపూర్తి. 297

4 ద్విరదగతి.

కర మొప్పఁ బంచలఘు•గణచతుష్టయము మాచే
విరమంబు రెంటఁబై • ద్విరదగతి పేరిచే. 298

5. విజయభద్రము.

ద్విరదగతి రెట్టింప • విజయభద్రము చెల్లు •
విదురపూజితపాద • వేదసన్నుతనామ
దరచక్రకార్ముకగ•దాఖడ్గధారణా •
తాపింఛసమగాత్ర • దళితదైత్యస్తోమ. 299

6 మధురగతి. 4 గణాలు 2 + 2 విరామాలు. 2ల. 3 (?)

[1]నాలుగుమాత్రలు • నాటినగణములు, నాలుగు రెంటికి • నలి విరమణములు
గలసి మధురగతి•కనలును జగణము, తొలఁగిన ధృతికా•సృష్టి కవిరమణము. 300

7 హరిగతి. నల, స, భ, గగ any eight. 5 గణాలు (?)

నలసభగగములలోపల నేదై•నను నెనిమిది నాల్గిటపై విరమము
గలసిన హరిగతి చెలు వగుఁ గృతులం • గవివరులౌ నని చెప్పిననియమము. 301

8 హరిణగతి. 14 లఘువులు - 8 ల. (?)

వరహరి పదియు • నాల్గులఘువులు, కదియఁత హరిణ•గతికి నెళవులు. 302

9. వృషభగతి. 28 లఘువులు - 15 లఘువులు

ఇరువదియెనిమిది లఘువులు [2]పది•యేనిట విశ్రాంతియుఁ గూర్చిన
నిర వగు వృషగతి పద్మాధిప • యిది విను మాదరమున మదమున. 303

యక్షగానలక్షణము.

సీ. తుద నేడులఘువులు • తొలఁగించి చదివినఁ ద్రిపుటకు వృషభగ•తిపదయుగము
లలిఁ గడపల నొక్క•లఘువు మానిన జంపె మనుద్విరదగతిస•మపదయుగము
గురు తగురచ్చెర•కుఁ దురగ వల్గనాహ్వయ మేకతాళియా•మధురగతికి (?)
సంఘ్రి కిర్వదినాలు • గటతాళమున మాత్ర లోలి విశ్రాంతి ప•ద్నాలుగింటఁ
తే. దెలియ నర్ధంబు నర్ధచం•ద్రికలు వీన
యక్షగానప్రబంధంబు • లతుక వచ్చు
రగడభేదంబు లివి యంద్రు • రసఁ గవీంద్రు
లవితవిజసేవకస్తోమ • యబ్ధిధామ. 304

1 నాలుగులఘువులు (ప). 2 పదిహేనిట (ప).

ఉదాహరణలక్షణము.

సీ. సప్తవిభక్తులు ◆ సంబోధనంబును గూడ నెన్మివిభ◆క్తులు క్రమమునఁ
బతిపేరు దొరలంగ◆బద్య మొక్కటిఁ జెప్పి రగడభేదములు మా◆ర్గములుగాఁగఁ
గళికలు నెనిమిది ◆ దళములు గావించి దానిలో సగము ను◆త్కళికఁ జేసి
యది యొక్కసమసనం ◆ బయ్యెడు దళము లెన్మిదిఁ గూర్చి వానికిఁ◆దుద విభక్తి
తే. బయలు పఱచి కట్టకడను◆బద్య మొకటి పలుక వలయును సార్వవి◆భక్తికముగ
నిర్వదాఱుపద్యములందు ◆ నిడిన ధాత్రి, నిది యుదాహరణ మటందు ◆ రిద్ధచరిత.
సీ. సంబోధనమునకు ◆ సరసాళి జయపతి ప్రథమకు వాణి వి◆రావళియును
క్షితి ద్వితీయకు స్ఫుట ◆ కీర్తిమతియుఁ దృతీయకుఁ గీర్తి సుభగయు ◆ నటఁ జతుర్థి
కిని దేవలాభిని◆యును భోగమాలిని పంచమికి నెసంగు ◆ వాణియును గ
ళావతి షష్ఠియు ◆ లలిత కాంతిమతియు సప్తమికిని ఘోణి ◆ సత్కమలయు
తే. నాదినూక్తులనామధే◆యములు వెనుకఁ, బలికినది వేల్పు లష్టవి◆భక్తులకును
వారుతమశక్తికోలఁదిని ◆ వ్రాలుఫలము, లిత్తు నాయకద్వయమున ◆ కిందిరేశ.
సీ. సంబుద్ధి యెడలించి ◆ సప్తవిభక్తులు పలికిన భక్తిసం◆ద్దలి యనంగ
సంబుద్ధితోఁ గూడ ◆ సప్తవిభక్తులు పలుక నొప్పారు బం◆ద్దలి యనంగ
సంబుద్ధితోడ వి◆షమవిభక్తులతోడఁ బలికినకృతియు వి◆ద్దళి యనంగఁ
గళిక లుత్కళికలు ◆ గమకింపఁ బలికినకావ్యంబు నుత్ఫుల్ల◆కంబనంగ
తే. నవనిఁ జాటుప్రబంధంబు◆లందు మిగుల, నాటుకొనియొప్పుచుండుని◆నాల్గుదెగలుఁ
గానఁబడు నుదాహరణము ◆ గ్లానలోల, కామెపల్లీశ వల్లవీ◆కామకృష్ణ. 307
ఉ. శ్రీవనితాసనాథుఁడు వ◆శీకృతభక్తమనోంబుజుండు వి
శ్వావనుఁ డుగ్రసేనుఁ డురు◆వైద్యుఁ డజేయుఁ డగణ్యసద్గుణ
ప్రావృతభూషణోజ్జ్వలుఁ డ◆హాగపతిక్షోటిమరీచి భద్రదం
తావళనాయకావనుఁ డు◆దారుఁడు కృష్ణుఁడు మమ్ముఁ బ్రోవుతన్. 308

కళిక. ।సూ+।ఇం+।సూ+ఇం+।సూ+।ఇం+।సూ+।ఇం.

మఱియు దేవకీశౌరసేనికు◆మారనిర్మలరత్నరాజము
కలుకుటసురల నెల్లఁ దారుణ◆కదనధారుణి దునుము తేజము
బలిమి నందనవనములోపలి◆పారిజాతము ధరకుఁ దెచ్చెను
గోలఁది మీఱినసమ్మదంబునఁ ◆ గుండలంబులు తల్లి కిచ్చెను
జెలఁగి నరునకు సూతకృత్యము ◆ చేసి కౌరవులఁ బరిమార్చెను
దలఁపు వఱుపనిదాసచయములఁ ◆ దవిలి తిరుగనిముక్తిఁ జేర్చెను

వెలఁదికొఱకును బాణుచేతులు ♦ వేయు నఱికినవిక్రమోగ్రుఁడు
జలదమాలఁజిగి దెగడునొడలున ♦ జానుమీఱెడుభుజసమగ్రుఁడు. 309

ఉత్కళిక.

కమలనేత్రు నిరాకరించుచు ♦ యమునయొడ్డునఁ దపము సేయుచు
నున్న కాంతను జూచి రయమున ♦ నన్నసుద్ది వచించి ప్రియమున
నరుఁడు గూర్చినమిత్రు డానతి ♦ కరము పక్కైడుదానిఁదావలి
విదళితాసురసార్వభౌముఁడు ♦ యదుకులాంబుధిపూర్ణసోముఁడు. 310

ఉ. మానవులార రోగశతములు ♦ మానును లేములు లేవు సంపదల్
జానగు దుఃఖముల్ తొలఁగు ♦ జాఱు నఘంబులు మందబుద్ధులై
దీనత నొందనేటికి ♦ నతిస్థిరభక్తినిఁ గొల్వుఁడీ పరా
ధీనులుగాక మీరు వసు♦దేవకుమారకు ముక్తికోసమై. 311

కళిక.

[1]మఱియు వ్రేతల నెల్ల ♦ మరులుకొల్పినవాని
మెఱసి కానను బసుల ♦ మేపి తిరిగెడువాని
భామతో దూర్వాసు♦బండియాడ్చినవాని
వేమఱెదిరినమగధు ♦ విరగఁ దోచినవాని
బాలుఁడై ఱోలెక్కి ♦ పాలుద్రావినవాని
హేలతోఁ బదిరూపు ♦ లెలమిఁ దాల్చినవానిఁ
దాళవృక్షము లెల్ల ♦ ధరణిఁ గూల్చినవాని
గాలిరక్కసుఁ జావఁ ♦ గాలఁ దన్నినవాని
లీలఁ గొల్తును గడిఁది ♦ లేమిఁ బాపెడివాని. 312

ఉత్కళిక.

మందుపావకుఁ గోల్చి ♦ కొండవావాలుతి వ్రేల్చి
పార్థివేశ్వరుఁ గాంచి ♦ పార్థు నక్కడ నుంచి
దారకుం డమరించి ♦ చేరఁ దెచ్చినమంచి
యరద మె*క్కక పూని ♦ పురికి వచ్చినవాని. 313

---

1 ఇందు రెండవచరణము మొదలుకొని అయిదుపాదములు వ్రా. ము. లలో లేవు. (ప. ఓ.)లలోఁగలవు.(వ్రా.ము) లలో ఇందలి 1-7-8 పాదములును (ప. ఓ.) లలో లేని 'లీలఁగొల్తును గడిఁదిలేమిఁబాపెడివాని' అనుపాదమును ఇట్లు నాలుగుపదములు మాత్రమే కలవు. * 'కొను' కుక.

చ. [1]పులకిల నేల మానవుల•[2]పుట్టును పావన మయ్యె నెప్పుడున్
[3]గళవడ మేల రోగము ల•కాలగతిం గడవట్టు నీతిబా
ధలును దరిద్రతావ్యథలు ♦ దవ్వులకేఁగును వాంఛితార్థముల్
గలుగు నమేయుచేతఁ గమ•లాధవుచే వటపత్త్రశాయిచేన్. 314

కళిక.

మఱియు బ్రహ్మమాయఁ గెల్చి ♦ మసలుమంత్రవాదిచేత
నెఱిఁగి సాంఘవునకు వరము ♦ లిచ్చి మెఱయువోదిచేత
మృతతనయుని మరల గురున ♦ కిచ్చినట్టియమృతుచేత
నతులరాసకేళి సలిపి•నట్టియాదినటునిచేతఁ
బిండి రుబ్బునాతిమోము ♦ పెరుగు దుడుచుకొంటెచేత
మండుచున్నకారుచిచ్చు ♦ మరిగి త్రావునమరుచేత
నెలుఁగుతోడఁ బోరి మణియు ♦ నింతిఁ గొనినయాజరుచేతఁ
వెలయఁ దులసిపూసపేరు ♦ వేసికొనినజోగిచేత. 315

ఉత్కలిక.

గట్టిగిశరపంజరంబు ♦ గట్టఁ దలఁచి వేగిరంబు
చవుటికడలిచెంతఁ జేరి ♦ పవనతనయుతోడఁ బోరి
తన్నుఁ జీరినంత వచ్చి ♦ చెన్ను గెలుపు నరున కిచ్చి
మహిమ మెఱయుకృష్ణుచేత ♦ మిహిరకోటిదీప్తుచేత. 316

శా. ఓలిం బాసకుఁ దేక మత్సరముతో ♦ నుప్పొంగి పెక్కేఁడులా
భీలాకారమునం గొలంకు[4]నడుమన్ ♦ బేటాడునక్రంబుతోఁ
జాలం గయ్యము చేసి చిక్కినపద•స్తంబేరమస్వామికై
కేలం బట్టి నిమిర్చినట్టిహరికై ♦ కృష్ణాంబుభృన్మూర్తికై. 317

కళిక.

మఱియునుఁ గౌమోదకియును ఖడ్గము ♦ మఱియును శంఖముఁ బట్టినహరికై
మెఱయఁగ విస్ఫుచ్చేలముఁ దాల్చక ♦ మెలఁగెడుదధికణపరిదిగ్ధునకై
పెలుచం గడిసిన[5]మల్లుల నిరువురఁ ♦ బిడికిటఁ బొడిచినబలుమల్లునకై
వెలయఁగ యమునానదిలోఁ గాళియ•విషధరుఁ దోలినయదుసింహునకై
విజయునిరథసారథియై గురునృప•భీష్మాదులఁ గెలిచినభూపతికై

1 పులసిల (ఓ. పూ. ము). 2 పుట్టువు (ఓ. పూ. ము). 3 గళవళ మేల (పూ. ము). 4 నడుమన్నిట్టాడు (పూ. ము); బేపాడు (ఓ.). 5 మల్లుర (పూ. ము).

గజగా యువనాభిధుమూపసునిఁ ♦ గనుదృష్టినిఁ జంపిన శ్రీపతికై
బలువిడి దేవకితండ్రిని మధురకుఁ ♦ బట్టము గట్టినగోవిందునకై
గెల దాల్చినవైఖరి గోవర్ధన♦గిరి మోఁచినమహానుభావునకై. 318

ఉత్కళిక.

తొలిపుట్టువునోము[1]ఫలంబున నే, బలువిడి వసుదేవదేవకీగర్భంబున నే
సరి కొండల మందుచుఁ జైనంబై, ప్రతికిం బరమానందమునకై
కొని యుబ్బుచు వచ్చి కలిమిపనికిం, గని యాడుచు లాసంగినబాపనికి
గ్గలి మిచ్చినబాలస్నేహునకై, కలుములచే నేలినకృష్ణునకై. 319

మ. పురిటింటం బసిబిడ్డచందమున నాఁ♦బోవంగ నాఁ డాత్మలో
ముదు వొప్ప న్విపదుద్ధమూర్తియగుచున్ ♦ ముద్దాడు రాకాసిక
న్నిరుకేలం గొని బాలు డ్రావుమిషచే ♦ నిష్ఠ్యూనకాలంబునన్
ధరణిం గూల్చిననందపుత్త్రువలనం ♦ దార్క్యాణధర్మస్థితుల్. 320

కళిక.

మఱియు గీతామృతస♦మగ్రసింధునివలన, వఱలు భవపటుతిమిర♦వనజబంధునివలన
బొంకు వెయ్యేడ లేని♦భూరిసత్యునివలన, జంకు వెన్నడు లేని♦సమరనిత్యునివలన
ఖేదము ల్వెడబాపు♦[2]కేశిమర్దనువలన, నాదికారణమూర్తి ♦ యగుజనార్దనువలనఁ
గాన రానిపదముల♦గాముపానుపువలన, [3]బూని గొడ్రాలికిం ♦ బుట్టెకానుపువలన.

ఉత్కళిక.

[4]తను బిల్వ మిగురు గూర ♦ దిని పాక మింపారఁ
జేసి ద్రౌపదిచేత ♦ నాస దీరఁగ మేఁత
యడిగినమునిశులకు ♦ నిడఁ గల్గు దాసులకుఁ
గల్పించుహారివలనఁ ♦ గల్పస్థాయివలన. 322

---

1 ఫలంబున నే—పూ. ము. అంత్యప్రాసనియమభంగము. 2 కేళి (పూ. ము.). 3 పూని గొడ్రాలికిఁ బుట్టు కానుపువలన (పూ. ము.) ఛందోభంగము; బూని గొడ్డురాలికి (ఓ.ప). 4 తనుఁ బిల్వమిగుల—పూ. ము. ఈచరణమున 21 మాత్రలున్నవి.

§ గుత్తితేఁ గిష్టంబుగఁ......నిర్ష్ఠ్యూనకాలంబునన్—పూ. ము. ఇది "క్త్వార్థకారసంధి" ఇది యప్పకవి యుపయోగించి యుండడు. కాబట్టి దీనిని సవరించుట న్యాయ్యము. మహాలాక్షణికుఁ డైనయప్పకవియె యిట్టియశాస్త్రీయమైన సంధిని జేసినచో నాంధ్రభాషకు మాఱ్పువచ్చుననుట యతిశయోక్తి గాదు. మరియు "నిర్ష్ఠ్యూన" అను పదము మిక్కిలి కర్ణకఠోరముగ నున్నది. తక్కినపద్యశైలిని చూడఁగా పదముల మార్దవము స్పష్టముగదా.

శా. [1]కారాగారమునందు వెల్వడి భుజం♦గస్వామి సుచ్ఛత్రమై
పై రా దాక్షిణ్యుఁడు వాకిట [2]శ్రేణులు వప్రస్తోమములన్ మీఱి శ్రీ
నూరోద్భాతి పథంబు నంగఁ దనుఁ గొం♦చుం దండ్రి యేతెంచి [3]చె
ల్వారఁ బల్లెను నిల్పఁ బొల్చు [4]హరికి ♦ న్వాలాక నే మ్రొక్కెదన్. 323

కళిక.

మఱియుఁ దెలియ నెఱయ నుఱియు♦మధునిఁ గూల్చినట్టిహరికి
నఱిమి తఱిమి చఱిమి సుఱుసు♦నద్రిఁ గెల్చినవితకరికిఁ
గఱచి చఱచి యుఱచి పఱచుఁ ♦ గపిఁ జంపినచ్యుతునకు
మఱిగి తిరిగి విఱిగి [5]సారగు♦మద్దులీడ్చినయమితునకు
[6]సరలి కెరలి వరలి మరలి ♦ సాల్వుఁ జంపినక్షరునకు
గరిమ మెరిమె యొరిమి నెరిమి ♦ కామెంపల్లిమందిరునకు
నయముఁ బ్రియము రయము జయము ♦ నరుని కిడినకేశవునకు
వ్యయము భయము లయము క్షయము ♦ వైరి కొసఁగుమాధవునకు. 324

ఉత్కళిక.

[7]గొల్ల లెల్లఁ దల్లడిల్లఁ ♦ బెల్లుజల్లు లల్లి రాళ్ల
సోనవాన మాన పూని ♦ కౌన రాని[8]కోనలోన
చుట్టి పట్టి గట్టి దిట్టు ♦ రొట్టు గట్టు మట్టు గుట్టు
నూఁచి లోచి నోచి మోఁచి ♦ [9]బ్రోచినట్టివామనునకు. 325

మ. పృథులావంతివరస్వయంవరమున ♦ న్విందానువిందానులన్
బ్రథనక్షోణిని గెల్చి సద్గుణ సుభ♦ద్ర న్భద్రఁ జేకొంచు వ
చ్చి ధరాధీశుననుజ్ఞచే ననలసా♦క్షికంబు గృహ్యోక్తస
ద్విధిఁ బెండ్లాడినకృష్ణునందు నిలిచె ♦ [10]న్ధీరప్రతాపోన్నతుల్. 326

కళిక.

మఱియు నుగ్రసేనా♦మాత్యునందు, నెఱి మీఱి లయకాల♦నిత్యునందు
విబుధార్చితపదార♦విందునందు, విదళితఘోరారి♦బృందునందు

1 కారాగారమునుండి. పూ. ము. 2 ద్రెలియ (ప). 3 చెల్వారంబల్లెను. (పూ. ము). 4 హారికీవాగార (ప). 5 యొరగు (పూ. ము.). 6 సరలిమరలి కెరలివరలి సాల్వుఁ జదిపినక్షరునకు (ప. ఓ.). 7 ఇందు (పూ. ము) అలోను (ప.) లోను మూఁడు చరణములు మాత్రమేఉన్నవి; (ఓ.)లో నాల్గుచరణములున్నవి. 8 కౌన-పూ. ము 9 ద్రోచినట్టి వామనునకు (పూ. ము); బ్రోచినట్టి వామనమునకు (ప). 10 దీర్ఘ (పూ. ము).

నాభీరువస్త్రాపహారునంను, బలిపట్టణద్వారపాలునంను
జలగాదిపశతనూచ్ఛాదునంను......... 327

ఉత్కళిక.

సజ్జరాగంబు, రజ్జురాగంబు, కంధియోగంబు, మందరాగంబు
రావుతో నూది, పీఁపుతో మోఁచి, వెలయుహారియంను, జలజాక్షునంను. 328

ఉ. ధర్మజుఁ డంపినం జరిగి దంతిపురంబున నాంబికేయుతో
ధర్మముఁ జెప్పి దుష్కృతుల [1]దగ్గఱ శాంతనవాదిసజ్జనుల్
నిర్మలచిత్తు లెల్లఁ గను నేరుపున న్సభఁ దాల్చినట్టిని
న్నర్మవచఃకృతిఁ దలఁతు నామమనంబున నందనందనా. 329

కళిక.

మఱియుఁ జగన్మోహనమాయఁ దాల్చినజాల, జిఱుతతఱి ద్రౌపదికిఁ జీరలిచ్చినకాల
సఖులతో నదిలోనఁ జల్లి గుడిచినబాల, విభవసుం డెదలోన వేఁ దలిర్చినలోల
నరుతేరినాగలపై నాట్యమాడినవీర, సరకుగొని భీష్ముపైఁ జక్ర మెత్తినశూర
తరిని సద్గురుసుతుల దాపరించినసదయ, పెరిమె నాగపురంబు పెకల్చించినవిజయ.

ఉత్కళిక.

గురుభీష్మరాధేయు లురుజన్యమున నేయఁ
శరవహ్ని బయ లెక్క యరద మెల్లను నెక్క
[2]తరి గొల్చునెడ పాండువరుల నేగురి మెండు
బ్రతుకఁ జేసినపుణ్య వితత దీనశరణ్య. 331

శా. నీ వాక్పాండవు నిన్ను నమ్మి కొలుతు న్నీచే సుఖం బబ్బె నీ
కై వే దండ మొనర్తు నీవలన నిష్టావాప్తి చేకూఱె నీ
కే విశ్వాసముఁ [3]జేర్చి తింక మదిలో హెచ్చయ్యె నీయందు నా
కైవారంబులు శౌరసేనతనయా కామేపలీవల్లభా. 332

ఉ. వామన విచ్చగింపు మిటు నన్నయభట్టకృతాంధ్రశబ్దచిం
తామణికల్పనోక్తికల నాచతురోపమ లుల్లసిల్ల ని
చ్చామతి నర్పణంబుగ నొసంగితిఁ గామెపలీశ నీకు నై
రామయమై తగ న్భువనదాహరణంబు జగత్ప్రసిద్ధిగాన్. 333

1 దగ్గఱ (పూ. మా.) యతిభంగము. 2 తరుగొల్చునెడ పాండుతనయులేగురి మెండు(పూ.మా); తరిగొల్చు(ఓ.); తరుగొల్చు(ప.); మఱికొన్ని తాటాకుపుస్తకములు చూచినగాని సరియైనపాఠము నిర్ణయించుటకు సాధ్యము గాదు. 3 జేర్తునింక(పూ.మా.).

వ. సీసంబు లనునవి సమవిషమంబుల రెండు దెఱంగు లయ్యె వానివిశేషంబు లెట్టివనిన.

సీసమాలిక.

యతి సైనఁ బ్రాసంబు • నందైన [1]నొకటితోఁ జెప్పి రేనియు సమ•సీస మగును
నియమము ల్లేనిపై • నిలిపిన సీసంబు లాఱుదెఱంగు లై • యతిశయిల్లు
నెనిమిదంఘ్రులఁ బ్రాస • మెక్కింప వళ్లకై సర్వతః ప్రాససీ•సం బనంగఁ
బ్రాస మాఱంఘ్రులఁ • బదిలంబు గావింప నక్కాలిప్రాససీ•సాఖ్య మనఁగ
నాది నేవడి నిల్పి • రావడే పద మెల్లఁ జేయ నయ్యాది వడి•సీస మనఁగఁ
బదఖండములయందుఁ • బ్రత్యేకయతులుగా స్థిర నవకలివడి•సీస మనఁగఁ
గుదురుగా నుత్సాహ • తుదయందు గీతంబు చెప్పిన విషమాఖ్య•సీస మనఁగఁ
గడ వెళ్ల లఘువులే • కల్పించి రెద్దాన సరవి సర్వలఘుసీ•సంబు ననఁగఁ
తే. సప్తవిధము లివియు శబ్ద•శాసనుండు, పంచమామ్నాయఫక్కిలోఁ • బల్కెఁగాని
కడమకవు లాఱుసీసము • ల్విడిచిపెట్టి, చెలఁగి సమసీసపద్యమే • చెప్పినారు. 335

అందు సీసలక్షణ మెట్టి దనినః—

క. సురపతు లాఱ్గురిపై భా, స్కరు లిరువురు గూడ నొక్క•చరణము పొల్పుం
బరఁగు నవి నాలుగడుగుల, విరమముపై రెంట రెంట • వెలయఁగ వలయున్. 336

క. వానిఁ జరణములు నాలుగు, చేసి తుదిని గీత మొకటి • చెప్పఁగ నయ్యెన్
సీసము తం గెడదేశవి, భాసురశుభఖేల కామ•పలిగోపాలా. 337

సమసీసము.

బ్రతికించె నెవ్వాఁడు • మృతగురుతనయుని మెలఁత వేఁడిన మెచ్చి • మేలు చేసెఁ
బోషించె నెవ్వాఁడు • పొదివినదారుణాపద లెల్లఁ దొలఁగించి • పాండుసుతుల
వెడలించె నెవ్వాఁడు • వెడపొడుబావిలో నూసరవెల్లి యై • యున్ననృగుని
మర్దించె నెవ్వాఁడు • మాసలంబున వృష్ణియుమభోజసైన్యాంధ•కాదినృపుల
తే. ప్రేల్చె నెవాఁడు ఖాండవ•విపిన మెల్ల, జాతవేదోత్థవిలసిత•జ్వాలమీఁద
నతనిఁ గీర్తింతు మదిలోన • ననుదినంబు, ననఁగ నలరారు సమసీస•మఖిలకృతుల.

సర్వతః ప్రాససీసము.

వేదండవరదుండు • వేధోండగాంగుండు కాదేనశయనుండు • యాదవేంద్రుఁ
డాదిత్యవంద్యుండు • నాదాససులభుండు వేదాంతవేద్యుండు • కాదఁబిలుఁ
డాదితేయుఁడు బిందు•నాదకళాతీతుఁ డాదిత్యకులజుండు • బాధితారి
మేదిపశ్రీశుండు • భూధరగాత్రుండు శ్రీదమిత్రసఖుండు • ద్వాదశాత్ముఁ

[1] రెంటితో (పూ. ము.).

తే. డాదిదేవుఁ డాశ్రితగంధ♦మాదనుండు, చేదిసాంభకవైదర్భ♦సూదనుండు
మేదురమురళినాదవి♦నోదుఁ డనుచుఁ, జెప్పినను సర్వతః ప్రాస♦సీస మగును. 339

[1]వృత్తప్రాససీసము.

శిక్షించె నెవ్వాఁడు ♦ [2]చేటుకై సభలోనఁ జెడుమాట లాడిన ♦ చేదివిభుని
రక్షించె నెవ్వాఁడు ♦ ద్రౌణిబాణము చేతఁ [3]జదియకుండఁగఁ బరి♦క్షిన్నృపాలు
భక్షించె నెవ్వాఁడు ♦ పర్వతాకృతిచేత నాభీరు లర్పించు ♦ నారగింపు
వీక్షించె నెవ్వాఁడు ♦ వేడ్కతో సేవకుల్ బ్రతుకునట్లుగఁ గృపా♦పాంగదృష్టి
తే. దాక్షిణాత్యుని సాంభక♦ధారుణీశుఁ, జంపె నెవ్వాఁడు పోరిలో ♦ సాహసమునఁ
బక్షిరాజతురంగుఁ డె♦వ్వాఁ డనంగఁ, జెలఁగుచుండు వృత్తప్రాస♦సీసము లిల. 340

వడిసీసము.

విజయసారథిఁ గాని♦వినుతింపఁగా నొల్లఁ గిరినాయకునిఁ గాని ♦ కీర్తిసేయ
యాదవేంద్రునిఁ గాని♦యభినుతింపఁగ నొల్ల మధుసూదనునిఁగాని ♦ మదిని నిల్పఁ
బద్మనాభునిఁ గాని ♦ ప్రణుతింపఁగా నొల్లఁ జానకీపతిఁ గాని ♦ ప్రస్తుతింప
బాణసంహారుఁ గాని ♦ భజియింపఁగా నొల్లఁ బీతాంబరునిఁ గాని ♦ ప్రీతిఁ దలఁప
తే. నవితవేదండపతిఁగాని ♦ యనుసరింప, ననుచు నినుఁ గూర్చి యనురక్తి♦నాత్మ నెప్పుడు
పొగడుసత్కవి♦వ్రజములఁ ♦ బ్రోచి తనరఁగ, దనరు వడిసీసభేదంబు ♦ తాళభేది.

అవకలివడిసీసము.

సామాజికాహిత♦స్తోమంబు సామంబుగా మించి మైత్రికి ♦ నామతింప
నభిమానధారుణీ♦విభులు దానంబుచే నక్కఱ లన్నియుఁ ♦ జక్కఁ జేయ
నతిరుక్షపక్షమా♦వతులు భేదంబుచే దినదినక్షీణత్వ♦మునకుఁ జెడఁగఁ
బదిలింపుటుద్దండు ♦ లాదిగి దండంబుచేఁ దనయాజ్ఞ యాదల ♦ నునిచి నడువ
తే. సంధియానాదిషాడ్గుణ్య♦బంధురముగ, [5]నోమి శక్తిత్రయోపేతుఁ ♦ డై మురారి
నేల ననురక్తి నీతితో ♦ నేలె ననుచుఁ, జేయ నవకలివడిసామ♦సీస మగును. 342

విషమసీసము.

అంచితముగ భీమునకు స♦హాయ మేగుదెంచి తా
నించు కెదిరి దురము సేయు ♦ నేయునంకుశంబు తా
కించుకొనక కినుకవలనఁ ♦ గెరలి నరకపుత్త్రి మ
ర్దించినట్టిసవ్యసాచి ♦ తేరిఘోటకావలిం

1 దీనికే (పూ. ము.) లో అక్కలిప్రాససీసమని పేరు. 2 చేట్కార్యా (ప).
3 చిక్కుకుండఁగ (పూ. ము). 4 జనముల (ప). 5 నార (పూ.ము).

ఆ. దోలుకృష్ణ యంచుఁ♦దోరంపుటుత్సాహ, మీఁద గీత మొకఁడు ♦ మేలవింప
విషమసీస మనఁగ ♦ వెలయుఁ గా మెపలీశ, జమ్మిచెంత నున్న♦చతురవచన. 343

## * సర్వలఘుసీసము.

క. క్షమ షట్త్రింశల్లఘువులు, త్రిమహేశవిరామము గల♦దీర్ఘపదచతు
ష్కముపై నొకగీతి ముర, ప్రమథన సర్వలఘుసీస♦పద్యమన కగున్. 344

సీ. చిఱుతయగు కొడుకున [1]కె♦దరయి మృతికి మొదలగు
[2]టూరులవలన విని రుష♦[3]వరుషుఁ డగుచు
చరమశరధిజలముల ♦ తరణి మునుగక మును
దురమున నురువడి బలు ♦ దురుసుపరచి
కెరలి గొనయము దురిమి ♦ మురిగుణము మొరయిడఁగ
నిరికిన శితశరములు ♦ పరువ విడువ
జరిగి నెళవెతిఁ గొదిగి ♦ మఱుఁగున నిలిచిన కురు
పతిమఱుఁదిని నెరి నురు ♦ మగను దలఁచి
తే. చేసినట్టిప్రతిజ్ఞ శా♦సింపఁగోరి, సవ్యసాచిశతాంగంబు ♦ సైంధవములఁ
దోలుగోవిందునుతులచేఁ ♦ దొడరుఁగృతుల, సర్వలఘుసీసపద్యంబు♦సాగుచుండు.

క. బలసోదరగీత్యుదితార్యలు నా ర్గార్యాఖ్యగీతు ♦ లాటవెలఁది తే
టులురెండు సమము లెత్తుక, మలనాహ్వయ పవడలు విష♦మంబులు మూఁడున్.

## సమగీతి.

క్షమఁ బథ్యాకందముచంద్రమునన్ రెండరలు దెలియఁ ♦ దనరింపన్
సమ మనుగీతికృతులలోఁ, గమలాహృదయాబ్జవాస ♦ కమలాక్షా. 347

---

* కరివరద పరమకృప ♦ ధరణిధర సురవినుత కనకవసన నరహరి♦గరుడగమన
నళినకరపదనయన♦దళితఖరదనుజలయ నరసఖ పరగుణనిధి ♦ శరధిశయన
పరమపదనిలయ హరి♦పరమపురుష ప్రకృతికిఁ బరుఁడని నినునిగమని♦వహము పలుకు
నిరతమునుహృదయమున♦నినుఁ దలఁతునను మనుపు మనియనఘచరిత జల♦దనిభత
తే. సర్వలఘుసీస మీరీతి ♦ సకలసుకవివరులు చెప్పుదు రిలమీఁద♦వరుస నెల్ల [నువ
వారు మెచ్చంగ సర్వేశ ♦ వారిజాక్ష, శ్రీ మెపల్లీశ యచ్యుత ♦ కామజనక. 345

ఈపద్యము (పూ. ము.)లో నున్నది. 1 కెదురయి(ప). 2 ఊరుల(ప). 3 వరు
షుఁడనచు (ఓ).

ఉద్గీతి.

మొదలిసగము చపలగతిం, దుద సగము పథ్యగతిని ♦ దొడరంగా
నిది యుద్గీతి యనం దగు, విదురాకూర్తిరాజితరద ♦ వేణుధరా. 348

ఉపగీతి.

ధరఁ జపలాకందముపై, ఖరి సగం బైనఁ ♦ గావ్యములఁ
బరఁగు నుపగీతి పూర్వా, మర ప్రజపమిస్ర ♦ మార్తాండా. 349

ఆర్యాగీతి.

సముదీరితపథ్యాకం, దముకన్నను నొక్క గురువు ♦ దాకించినచో
క్షమ నార్యాగీతి యగు, న్గమలాప్రాణేశ సహజ♦కందం బదియే. 340

సమగీతులందు నాటవెలఁది.

మేలు మే లటంచు ♦ మిత్రులు ముగ్గురు, వింత వింత యనుచు ♦ విబుధు లిద్ద
ఱహహ యనుచు నూరు♦లయిదుగురును మెచ్చ, నాటవెలఁది మూఁట♦నలరు సగము.

తేటగీతి.

మిత్రుఁ డొక్కఁడు వీణియ♦మీటుచుండ, విబుధవరు లిద్ద ఱర్థంబు♦విప్పి చెప్ప
నినులు నిద్దఱు వినుచుండ♦నేకగతిని, దేటగీతంబు మూఁటను ♦ వాట మయ్యె. 352

విషమగీతులందు నెత్తుగీతి.

సురనాథు మీఁద♦నూరు లిరువురు రెంట విరతి
ధరణిఁ బ్రాసంబు ♦ [1]దనరు హరి యెత్తుగీతియందు. 353

కమలనగీతి.

హగణ మైనఁ జాలు నగణ♦మైనఁ జాలు హగణ
నగణములును రెండు గలసి ♦ నాటి యంఘ్రి కేడు
తగినవిరతి నాలుగింటఁ ♦ దనరఁ బ్రాస మొదవి
మిగుల మెఱయుచుండుఁ ♦ గృతులఁ గమలనాఖ్యగీతి. 354

పవడగీతి.

అవని ముగురుభాను ♦ లాదిత్యపతు లిద్ద, ఱవల నేగు రర్క ♦ లర్థమునకుఁ
బవడగీతియందుఁ ♦ బ్రాసముల్ సమకూఱు, నవియె యాటవెలఁది♦యందు లేవు.

వ. ఇది నవగీతివివేకం బింక బిరుదావళిలక్షణం బెఱింగించెద. 356

తే. క్షితి మహారాష్ట్రభాషచేఁ♦జెప్పఁబడెడు, భీకరోక్తులు బిరుదు లై♦పెక్కు దనరు
[2]వాటబిరుదావళియొనర్ప♦వలయునండ్రు, బుధులు సంబుద్ధిపదములు♦పొసఁగఁగూర్చి.

---

1 దనరు నెత్తు గీతియందు-(పూ. ము) ఛందోభంగము. 2 వాని (పూ. ము). 'వాట' అని వ్రాఁతప్రతులలో నిపాఠము తప్పని దిద్దినచోఁ దల 'వాన' అనియుండవలెను.

చ. అతిభుజవిక్రమోద్భవము • లై రిపుకర్ణకఠోరకంబు లై
[1]యతులితవీరవాక్కు లయి • యాదిమపార్థివలాంఛనంబు లై
ప్రతిపదనూతనంబు లయి • భాసిలుసూక్తులు గూర్చి స్వస్తివా
క్యతతులఁ జెప్ప నొప్పు బిరు•దావళి సార్వవిభక్తికంబుగాన్. 358

చ. సలలితవాక్యగుంభనల • సర్వవిభక్తుల [2]దీపనంబులన్
జెలు వగుపద్య మొక్కటి ర•చించినపిమ్మట గాఢరీతి సం
కలితచతుష్కషట్కదళ•గద్యము లెన్మిదియుం బదాఱు నిం
పలరఁగఁ గూర్చి పేర్చి బిరు•దావళిఁ జెప్పఁగ నొప్పు నెంతయున్. 359

చక్రవాళము.

క. ఒకపద్యముపిదప దళా, ష్టకసందర్భాష్టగద్య • చతురం బగుఫ
క్కికిఁ జేరు చక్రవాళం, బకట చతుర్భద్ర మదియె • యచ్యుత మఱియున్.

క. తొలిసమసనాంత్యవర్ణయు,గళమే పునరుక్తిఁ గాఁగఁ • గైకొని సామీ
ప్యలసత్సమాసము మొదల, నలరించినఁ జక్రవాళ • మగు దాశార్హా. 361

తే. అవధరింపుము దేవ ది•వ్యప్రభావ, భావనాతీత నిస్తుల•[3]పరమపూత
పూతనాజైత్ర సుత్రామ•పుత్త్రమిత్ర, మిత్రశశినేత్ర నిర్జర•స్తోత్రపాత్ర. 362

చిత్రకవిత్వము.

సీ. అనులోమము విలోమ•ము నిరోష్ఠ్యమును దల, కట్టును గుడులు శృం•గములు నక్ష
రవిలోపమును బద•భ్రమకంబు పద్యభ్ర, మకమును నల్లెంట్లు • మఱియు నేక
పదియు ద్విపదియుఁ ద్రి•పదియును నేకవ, ర్ణంబును ద్వ్యక్షరి • త్ర్యక్షరియును
సరవి నిచ్ఛావాక్య•సంఘట్టనంబును, నాదిగాఁ గొన్నిప•ద్యంబు లెల్ల

తే. క్షితినిఁ జిత్రకవిత్వప్ర•సిద్ధనామ, ధేయములచేతఁ బెం పొంది • తెలివి మీఱు
[4]వానిఁ దెలియఁగ వచియింతు • వాసుదేవ, నందగోపాంగనాపుత్త్ర•నరకజైత్ర.

అనులోమము.

క. దామోదరసామతసధ, రామాసరసాకరదశ•రథమారిరాధా
కామా సదయాతిపరమ, ధామా వరయాదవకుల•దారకరాసా. 364

విలోమము.

సారాకరదాలకువద, యారవమాధామరపతి•యాదసమాకా
ధారారిమాథరశదరక, సారసమారాధనతమ•సారదమోదా. 365

---

1 యతులనిరుద్ధ (ప.ఓ.). 2 దీపనోక్తులన్ (ప.ఓ.). 3 పరమమూర్తి -(పూం.యు) పునరుక్తి నియమభంగము. 4 వాఁటి యని తాటాకుపుస్తకములన్నిటను గలదు.

నిరోష్ఠ్యము.

క. పావన సాధాబాధా, మావా యనునాఱులిపులు ♦ మఱి పద్యములో
భావింప దొరల కుండిన, భూవలయమున న్నిరోష్ఠ్య ♦ము పిసాళించున్. 366

క. నరహార్యక్ష దయాకర, కరిరక్షణ చక్రహస్త ♦ కాంచనచేలా
గరుడతురంగ జనార్దన, ఖరదైత్యనికృంతన హరి ♦ కంజదళాక్షా. 367

తలకట్లు.

క. హర కలశజ తపన పవన, శరభంగ మతంగ దక్ష ♦ సత్యావాసా
స్మరపదయుగ గరుడధ్వజ, ధరధర సమ్మరయు మనఁగఁ ♦ దలకట్టులగున్. 368

గుడులు.

క. విరివిని నిలిచిరి విని చిక్కిరి పివి నిశిఁ దిరిగిరి తిరి ♦ గి మిడికి భీతి
ల్లిరి చింతిల్లిరి తివిరిరి, సిరికొలకు ధనాఢ్యు లనఁగ ♦ క్షితి గుడుగు లగున్. 369

కొమ్ములు.

క. గురుఁడును శుక్రుఁడు నుగ్రుఁడు
పురుహూతుండును శుకుండు ♦ బుధుఁడును గుహుఁడుఁ
బురుకుత్సుండును గుత్సుఁడు
గురునుతు లొనరించి రనఁగఁ ♦ గొమ్ములు కృష్ణా. 370

అక్షరవిలోపము.

క. రవికన్యాసుందరకర, మవలంబన మోర్చి యూఁదె ♦ నచ్యుతుఁ డని యే
నవవర్ణవిలోపముగా, నవని బఠియింప వలయు ♦ నార్యులు నలరన్. 371

పదభ్రమకము.

క. ధీరానానారాధీ, ధారాకరతాతరళిత ♦ తారకరాధా
ధారాసుతతసురాధా, ధారితతరిధాన నాఁ బ ♦ ద భ్రమక మగున్. 372

పద్యభ్రమకము.

క. రాధానాథా తరళిత, సాధకరధతావరసుత ♦ సరసనిధానా
నాధానిసరసతనురవ, తాధరకధసాతళిరత ♦ ధానాధారా. 373

నల్లెంట్లు.

క. నారదమునిశార్దూలము, కూరిమి నజినంబు గప్పు ♦ కొని వేడుకతో
నారాయణవాసమున క,నారత మేతెంచు ననఁగ ♦ నల్లెంటు లగున్. 374

ఏకపాది.

తే. మతివినాయకభరితస♦మ్మ్రనుఁ డనంగ, మతివినాయకభరితస♦మ్మ్రదుఁ డనంగ
మతివినాయకభరితస♦మ్మ్రనుఁ డనంగ, మతివినాయకభరితస♦మ్మ్రదుఁ డనంగ. 375

ద్విపద.

తే. సౌమ్యగురుకవుల్ నినుఁ బ్రీతి ♦ సరసిజాక్ష
భోగిభోగాసనుం డని ♦ [1]పొలుచు టరుదె
సౌమ్యగురుకవుల్ నినుఁ బ్రీతి ♦ సరసిజాక్ష
భోగిభోగాసనుం డని ♦ పొగడ ద్విపద. 376

త్రిపద.

తే. దేవమునివంద్య గోవింద ♦ దితిజహారణ
పుండరీకాక్ష యవ్యక్త ♦ పుణ్యపురుష
యమరసన్నుత గోపాల ♦ హరి ముకుంద
దేవ యవ్యక్త హరియు నాఁ ♦ ద్రిపదయయ్యె. 377

ఏకాక్షరి.

క. నానాననానున్నన, నూననునిన్నెను నేను♦నున్నునినినన్నై
నానినను నానానును, నానూన యనంగ నొంటి♦యక్షర మయ్యెన్. 378

ద్వ్యక్షరి.

క. మునినామా మమ్మును మన్నమున నూనిన నేమమునను ♦ మొనమానను న
న్మనుమని మననము మన్నన, ననుమానానాముని నని [2]య♦న ద్వ్యర్ణమగున్. 379

త్ర్యక్షరి.

క. మానితమతితో మమతను, నీనామము నేమమునను ♦ నేను మననమునన్
నూనమున మతము మానను, దానకముగఁ దలఁతు ననఁగఁ ♦ ద్ర్యక్షరి యయ్యెన్.

ఇచ్ఛావాక్యసంఘట్టనము.

క. తోఁటలు లెస్సై యున్నవి, తాటాదూటములు గావు ♦ తాపసు లుండన్
బేఁటలు దామోదరుచె, ల్లాటలకు న్నైళవులు మధు♦రాపురిచెంతన్. 381

వ. ఈపద్యమునఁ దోఁట తాట పేఁట ఆట యనుమాట లర్థవంతములుగాఁ గూర్చుటం
జేసి దీనిపేరు ఇచ్ఛావాక్యసంఘట్టనము. 382

1 పోల్చు (ప్రా. మా); పొగడు (Ed.). 2 'యనం ద్వర్ణ్యమగున్' అని ఉండవలెను. యనద్వ్యర్ణ-ఇందు 'న' గురువుకాదు గనుక ఛందోభంగము.

## బంధకవిత్వము.

సీ. గోమూత్రికాఛత్ర • గుచ్ఛకుండలినాగ, కంకణమర్దల • ఖడ్గచక్ర
పంకజసర్వతో • భద్రమాలాక్షరీ, ప్రముఖబంధంబు లే • ర్పడఁగఁ జెప్ప
వృత్తము ల్బంధక • విత్వవిశ్రుతము లై, కవులకుఁ జెవులపం • డువులు చేయఁ
బటుతరప్రౌఢిమఁ • బండితపామర, సాధారణంబుగా • జగతిలోన

తే. రాధికాకేళికాలోల • రమ్యశీల, భూరిగుణసాంద్ర యదుకులాం • భోధిచంద్ర
వల్లవీమానచోర దు • ర్వారశూర, పరమవాచాల రాజగో • పాలబాల. 383

తే. మొనసి రెండుచ్చరేఖల • మూలలందు
వలయ బద్ధ్యంబు నాలుగం • ఘ్రులను వ్రాసి
చదివి రేనియు సుకవులు • సమ్మదమున
ధాత్రి గోమూత్రికాఖ్యబం • ధంబు దనరు. 384

### గోమూత్రికాబంధము.



మాలిని. కనకనయనవైరీ • కాదపాహారవాహా
వనజనయనశౌరీ • వాదవాహారివాహా
వనధవదవిధిజ్ఞా • పాదసంభూతగంగా
వినయనరవిధిజ్ఞా • వేదసంభూతగంగా.



క. వితరణశూరదయార్ణవ, ధృతచక్రధరవరసింహ • ధృవశోధిమహా
వితరణధీరనయార్ణవ, జితనక్రపరతరగావ • జీవనధిస్ఫూర్తి.




## ఛత్త్రబంధము.

క. పారదమదనకవసుధర
దారద సమసమసనాసఁదరమారీచా
చారీమారవరాకా
కారావరదారధసువఁకనదమదరపా,

## గుచ్ఛబంధము.




మాణవకవృత్తము.—
గాదిలితో మాలదిగా, గాదిలకించెఁ బదిగా
గాదిబకృష్ణుం డదిగా, గాదిడవాచా లిదిగా.

## కుండలినాగబంధము.

క. ఇలతోఁ గనబడినాలుగు, నిలయంబు లగుఁ బయోధ • నిధినీలాంగా
మెలిగొన్న పామువలె వెల్యుపలగున్ దలతోఁ కనాగ • బంధంబునకున్.




చ. ద్యుతిధర దేవకీతనయ • తోయభవస్తుత భూరమేశ సం
మితగుణసారభూతిదయ • మేయబృహజ్జవపూరుపావనా
జితవరకాపురాతనయ • జేయసువిష్ణిరభారవాహశా
శ్వతపురుషాంతకీతదవ • పావకశస్త్రపురాణకోవిదా.

## కంకణబంధము.



సేవేగోపాలం కేశిఘ్నం, గోప్రద్ధ్వద్రిధ్రుంకంశంభుం
శ్రీదం భూనాథం వీనార్యం, కందాభాసం నిరాగారం.

## మర్దలబంధము.



రాజాలు రాజశయానా, లాజలు చప్లీవయానక్ష
పూజలు గావశప్త్రిక్ష, రాజలు రాజనవయ్యా.

## ఖడ్గబంధము.

**లక్షణము:—**

క. చరణాంత్యవర్ణ మొక్కటి, చరణయుగాద్యంబుజేసి • సరసులు మూడ్నా
రిరుగడల మధ్య మొకటిగ, పరుజుల గదియింప • ఖడ్గబంధం బొనరున్.




**లక్ష్యములు:—**

క. శమదమసమధికచిత్తా, విమలాంభోజారిహస్త•విష్టరకర్ణా
యమలార్జునతరుభంజన, కమలాధరణీసనాథ • కంధరవర్ణా.




క. ధనదనవీనకనత్క్న, కనకాంబరవాసుదేవ • కరుణాపాంగా
శనివరద శుభకర దశ,త్కనకకశిపు పూర్వదేవ•కందనిభాంగా.



క. శూరవరద రఘువరముర, మారణ చాణూరకంస•మధుపౌండ్రహరా
రారాజత్కనకాంబర, ఘోరగ్రాహారిరక్ష • గోపీజారా.



క. శారదరసారమణదర, పారదరజనీశకీర్తి • పావనచరితా
తారకరిపువినుతహరియ, పారదయార్ణవముకుంద • భావజతాతా.



సుగంధి:—

కోరితీరి వారిజాక్షు • గోరఁజేరఁజేరవే
వేరువడ్డదైత్యుఱొమ్ము • వేగిలించి లెస్సగా
గారవించి యతనిపుత్త్రు • గాంచి వేడ్కఁ బ్రోవవే
జేరువేర నింగినిల్చి • వేల్పులెల్ల మ్రొక్కఁగన్.

## చక్రబంధము.

లక్షణము:—

సీ. వర్తులాకృతులుగా పదిగీతులు లిఖించి యాతలితరమధ్యమాలయమున
నంటంగఁ గడలెల్ల నారురేఖలు గీసి, క్రిందిపందొమ్మిదో ఛందమునను
బ్రోదిపుట్టినవృత్తి మీఁదైన మూఁడంఘ్రి లటువ్రాసి నడిమింటి నాదివర్ణ
మేది యయ్యెను నది యిసుమారు రాఁజెప్పి మాట నారిట నామమాలరచించి
గీ. కడలు గలయంగ నాలవ • కాలువలికి, చక్రబంధస్వరూపంబు • సభ్యులెల్ల
వ్రాయఁదగుఁ గా మెపల్లీశ • వారిజాక్ష, జమ్మిశెడనున్న గోపాల • చారుశీల.

## చక్రబంధము.



అన్వయము:—

శా. భద్రాకామకసోమసూర్యనయనా భ్రాజిష్ణుశౌర్యక్రమా
క్షుద్రాక్రుద్ధ విమర్శితాంగనతతా స్తోకప్రసంపత్కరా
భద్రానూనజయావహావినయుతా గ్భావిష్కృతాయత్క్షమా
మాద్రీశా భవతక్షుకా శుభకరా మాంగల్యరాసోద్యమా.

## అష్టదళపద్మబంధము.



స్రగ్ధర. రాధాసక్తారసగ్రా ♦ వ్రజకులతిలకా ♦ త్రాతకృత్ప్రియధేరా
రాధేయత్ప్రాకృతత్రా ♦ ప్రవిమలసుగుణా ♦ గ్రావవర్యాప్రధీరా
రాధీప్రర్యావవగ్రా ♦ ప్రకటదనుజజై ♦ త్రాపదప్రోత్థభూరా
రాభూత్థప్రోదపత్రా ♦ ప్రరుచిరపృథుక ♦ గ్రాసరక్తాసధారా.

## సర్వతోభద్రబంధము.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| వం | దే | స | దా | దా | స | దే | వం |
| దే | వ | రం | ప | ప | రం | వ | దే |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దా | ప | కం | త | త | కం | ప | దా |
| దా | ప | కం | త | త | కం | ప | దా |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దే | వ | రం | ప | ప | రం | వ | దే |
| వం | దే | స | దా | దా | స | దే | వం |

వందేసదా దాసదేవం, దేవరం పవరం వదే
సరంగకంకంగరసం, దాపకంతతకం పదా.

## మాలికాబంధము. 1



అనంత నందనందనా సనాతనా జనార్దనా
వనాటరత్నరక్షరమ్యనాగనాధనాశనా.

## మాలికాబంధము. 2



చ. ఖరహర ధీరదేవకన•క ప్రకటాంబరవీరసారదు
ర్ధరధరవారవేణురవ•రమ్యరమేశ మహామహామహీ
ధరగరహారసన్నుత కృ•తజ్ఞతశిష్టపరాపరాపరం
శరణ రజోరమావిశద•శ స్తశమాత్మక శ్రీకళాకరా.

వ. ఇది బంధకవిత్వం బిట్టి గర్భకవిత్వంబు వివరించెద. 385

## గర్భకవిత్వము.

సీ. గాంగేయకౌశేయ•ఘనకందగీతసద్గర్భచంపకమాలి•కయును వరిష్ఠ
కందపద్యద్వయ•కమలవిలసితరుగ్మవతికాగర్భిత•క్రౌంచపదము
గీతమత్తేభవి•క్రీడితాకందగర్భితసీసము నట పంచవృత్తగర్భి
తోత్పలమాలిక•యును సుకల్పితకల్పవల్లియు సీసరూ•పద్విపదయు
స్రగ్విణీగర్భభు•జంగప్రయాతంబు కందగర్భితమణి•గణనికరము
[1]కలితచతుర్విధ•కందపద్యము నష్టవిధకందమును బంచ•విధసువృత్త
తే. మాదిగాఁ గలకొన్ని ప•ద్యములు పెక్కు, సరవిఁ బద్యము లిమిడి దో•షములులేక
కాన వచ్చిన వవి యెల్ల • గర్భకవిత, ధరణి నొప్పారు నీరీతిఁ • దనరి కృష్ణ. 386

## కందగీతగర్భచంపకమాల.

చ. నరహరి కేశవా వనజ•నాభ రమాధవ సంశ్రితార్త బం
ధురసుగుణాకరా దురిత•దూర జనార్దన దోర్బలాఢ్య గి
[3]ర్వరగిరిశస్తుతా మురహ•రా సురపూజితముఖ్యపాద సుం
దరపురుషాగ్రణీ భుజగ•తల్ప శచీపతిపుత్త్రరక్షణా. 387

వ. ఇది భాషాపరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె. 388

## కందద్వయకమలవిలసితరుగ్మవతీగర్భక్రౌంచపదము.

ద్వారవతీనా•థా సముదారా తరుణధవళకర • ధరనుతనామా
మారమణీధా•మా సుకుమారా మరుదధిపతిరిపు•మదగిరిశంబా
సారసనేత్రా • సత్యవిచారా శరరుహభవముఖ•సకలసురేశా
శూరకులా తే•జోజితసూరా సురవరమణినిభ•సురుచిరదేహా. 389

వ. ఇది వర్ణపరిచ్ఛేదములోఁ దెలియఁజేయఁబడియె. 390

## మత్తేభవిక్రీడితాగీతకందగర్భసీసము.

వినయసంపన్నర•విప్రభూతరమణీనాథా పయోజేక్షణా నరాత్త
విభయదాకార హ•విర్భుగాయతరిపుప్రాణానిలాహీశ్వ•రా రమేశ
విలయకాలానల•విక్రమప్రథిత సాల్వగ్రావవృద్ధశ్ర•వా వరేణ్య
విలయశీలా యదు•వీర కౌస్తుభధరా చక్రి యశోదాత్మజా ముకుంద
తే. కరివరద పూతనాంతక • గరుడగమన, సత్యసహిత కామజనక • శంకరసఖ
కనకవసన సుందరదేహ • వనధిశయన, సనకమునివినుతచరణ•సరసిజయుగ. 391

వ. ఇది వళిప్రాసపరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె. 392

---

1 కనలు (ఓ). 2 విఖ్యాతి (ఓ). 3 ర్ధర (ప).

వాణీపద్మాంబారతిదరధ్వనితాళమధురగర్భోత్పలమాలికావృత్తము.

ఉ. శారదశాసితప్రసవ•చాపవిఖండన సామసన్నుతా
శారణదాసపోషధవ • తాపసమండన ధర్మతత్పరా
వారణభాసురప్రభవ•ప్రాపకఖండన వాసవానుజా
పారద వాసుదేవ భవ•పాపవిదండన భర్గపూజితా. 393

ఇది యీపద్యపరిచ్ఛేదముతుదను ... పెదము.

కల్పితకల్పవల్లీప్రహారణకలిత.

కరధృతకరహాం • కరిహితకరణం, కరుహాసఖరుచిం • గరుడఖగరథమ్
ఖరసునకరవిం • ఖరతరకరగం, గరళముఖరిపుం • గరధరకరతమ్. 394

ఇది సంధిపరిచ్ఛేదములోఁ దెలిపెదము.

మఱియుఁ, గల్పితకల్పవల్లీ భాస్కరవిలసితము.

అక్షరహారివిక•చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు•రద్విపరక్షా, రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా
పక్షగపతిరథ • పౌంద్రవిపక్షా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృక్షగసహచర • ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప • ఋషిజనపక్షా. 395

గర్భప్రథమకందము.

అక్షరహారివికచాంబురుహాక్షా యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదురద్విపరక్షా రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా. 396

గర్భద్వితీయకందము.

పక్షగపతిరథ పౌంద్రవిపక్షా భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృక్షగసహచర ఋక్షసదృక్షా ఋక్షపదుహితృప • ఋషిజనపక్షా. 397

గర్భద్విపద.

అక్షరహారివిక•చాంబురుహాక్ష, యక్షపసఖనుత • యదుకులదక్ష
రక్షకసురవిదు•రద్విపరక్ష, రాక్షసవిదళన • ప్రరుచిరవక్ష
పక్షగపతిరథ,• పౌంద్రవిపక్ష, భక్షితదవశిఖి • బహుసవదీక్ష
వృక్షగసహచర • ఋక్షసదృక్ష, ఋక్షపదుహితృప • ఋషిజనపక్ష. 398

లాలిపాట.

అక్షరహారివిక•చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు•రద్విపరక్షా, రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా. లాలి.

పక్షగపతిరథ • పౌంద్రవిపక్షా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృక్షగసహచర • ఋక్షసదృక్షా, ఋక్షపమహితృప • ఋషిజనపక్షా. లాలి. 399

## పెండ్లిపాట.

అక్షరహరివిక • చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు • రద్విపరక్షా, రాక్షసవిదళన • ప్రరుచిరపక్షా. [1]గౌరీకల్యాణవైభవమే.
పక్షగపతిరథ • పౌంద్రవిపక్షా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృక్షగసహచర • ఋక్షసదృక్షా, ఋక్షపమహితృప • ఋషిజనపక్షా. గౌరీకల్యాణ వైభవమే. 400

## ధవళము.

అక్షరహరివికచాంబురు • హాక్షా యక్షపసఖ
రక్షకసురవిదురద్విప • రక్షా రాక్షసవిదళన
పక్షగపతిరథ పౌంద్రవి • పక్షా భక్షితదవశిఖి
వృక్షగసహచర ఋక్షస • దృక్షా ఋక్షపమహితృప. 401

## [2]సువాల.

అక్షరహరివిక • చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు • రద్విపరక్షా, రాక్షసవిదళన • ప్రరుచిరపక్షా. సువ్వీ సువ్వాలతే. ౧
పక్షగపతిరథ • పౌంద్రవిపక్షా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృక్షగసహచర • ఋక్షసదృక్షా, ఋక్షపమహితృప • ఋషిజనపక్షా. సువ్వీ సువ్వాలతే.

## అర్ధచంద్రికలు.

అక్షరహరివిక • చాంబురుహాక్షుణా. ౧
యక్షపసఖనుత • యదుకులదక్షుణా. ౨
రక్షకసురవిదు • రద్విపరక్షుణా. ౩
రాక్షసవిదళన • ప్రరుచిరపక్షుణా. ౪
పక్షగపతిరథ • పౌంద్రవిపక్షుణా. ౫
భక్షితదవశిఖి • బహుసవదీక్షుణా. ౬
వృక్షగసహచర • ఋక్షసదృక్షుణా. ౭
ఋక్షపమహితృప • ఋషిజనపక్షుణా. ౮

---

1 'గౌరీకల్యాణావైభావమే' అని (ఓ. ప.) లలో వ్రాసియున్నది.
2 సువ్వాలే (పూ. ము.).

### [1]కందగర్భసీసరూపద్విపద.

మకరకుండలకర్ణ ♦ మహితాభ్రవర్ణ శకటదానవవిపక్ష ♦ కమలజాక్ష
శుభికాలసత్ఫాల ♦ సుయశోవిశాల యభిరమతస్నిగ్ధయా♦పీతదుగ్ధ
శ్రితదేవతరుమూల ♦ చేదీశకాల ధృతమణిధరగదారి ♦ తపతికథిత
నివసితవైకుంఠ ♦ నియతాబ్జకంఠర వికళాదశుభనేత్ర ♦ విజయమిత్ర

తే. సతతసనకాదిసన్నుత ♦ చతురచరిత, యాదవకుల సత్యనిరత ♦ యచ్యుత మధు
విదళన హరిశాశ్వతకృష్ణ♦విదురవరద, భవవిరించినుతా యంచుఁ ♦ బ్రస్తుతింప. 405

### గర్భద్విపద.

మకరకుండలకర్ణ ♦ మహితాభ్రవర్ణ
శకటదానవవిప♦క్ష కమలజాక్ష
శుభికాలసత్ఫాల ♦ సుయశోవిశాల
యభిరమతస్నిగ్ధ ♦ యాపీతదుగ్ధ
శ్రితదేవతరుమూల ♦ చేదీశకాల
ధృతమణిదరగదా♦రితపతికథిత
నివసితవైకుంఠ ♦ నియతాబ్జకంఠ
రవికళాదశుభనే♦త్ర విజయమిత్ర. 406

### గర్భకందము.

సతతసనకాదిసన్నుత, చతురచరిత యాదవకుల ♦ సత్యనిరత య
చ్యుత మధువిదళన హరి శా♦శ్వత కృష్ణ విదురవరద భ♦వవిరించినుతా. 407

### స్రగ్విణీగర్భభుజంగప్రయాతము.

నమో దాశకా వేణు ♦ నాదప్రవీణో, ద్యమా యాశుషేణా మ♦హా[2]యావనారీ
రమాధీశ దామోద♦రా దేవదేవో, త్తమా భేశమిత్రాక్ష♦[3]యింద్రానుజాతే. 40

### గర్భస్రగ్విణీవృత్తము.

దాశకా వేణునా♦దప్రవీణోద్యమా
యాశుషేణామహా♦యావనారీరమా
ధీశ దామోదరా ♦ దేవదేవోత్తమా
భేశమిత్రాక్ష యిం♦ద్రానుజాతే నమో 409

1 కందగర్భద్విపదరూపసీసము (ప.). 2 తార్క్ష్యానుయాయీ-(పూ. ము.) ఇందును యతిభంగము. 3 ఈచరణమున (ప. పీ.) అలోనిది పాఠము ఇందును యతి

కందగర్భమణిగణనికరము.

కరధృతజలజునిఁ • గరిపతివరదుఁ బరమదురుచిజిత • వనజునిఁ బరముం
బరివృఢుఁ గొలిచెదఁ • బరపదశరణుం, శరణాగతనుత • చరితునిఁ గరుణ౯. 410

గర్భకందము.

కరధృతజలజునిఁ గరిపతి, వరదు౯ బరమదురుచిజిత • వనజునిఁ బరము౯
బరివృఢుఁ గొలిచెదఁ బరపద, శరణు న్శరణాగతనుత•చరితునిఁ గరుణ౯. 411

చతుర్విధకందము.

రెండవచరణంబునకు, న్రెండవగణ మాది గాఁగ • నిర్మించిన-నా
దండఁ జతుర్విధకందము, పాండవపక్షా మెలంగుఁ•బ్రాజ్ఞులసభల౯. 412

చతుర్విధకందము.

బలులేమిచేత వేసరు, చెలికిం జిపిటంబు లీయఁ • జేకొని కృపతోఁ
గలి మిచ్చినావు కేరుచు, నెలమిం గృప నేంగితద్జ్ఞ•హితవుగ విపుల౯. 413

గర్భద్వితీయకందము.

చిపిటంబు లీయఁ జేకొని, కృపతోఁ గలి మిచ్చినావు • కేరుచు నెలమిం
గృప నేంగితద్జ్ఞహితవుగ, విపులం బలులేమిచేత • వేసరుచెలికి౯. 414

గర్భతృతీయకందము.

కలి మిచ్చినావు కేరుచు, నెలమిం గృప నేంగితద్జ్ఞ•హితవుగ విపుల౯
బలులేమిచేత వేసరు, చెలికిం జిపిటంబు లీయఁ • జేకొని కృపతో౯. 415

గర్భచతుర్థకందము.

కృప నేంగితద్జ్ఞహితవుగ, విపుల౯ బలులేమిచేత • వేసరుచెలికిం
జిపిటంబు లీయఁ జేకొని, కృపతోఁ గలి మిచ్చినావు • కేరుచు నెలమి౯. 416

మాలికాచతుర్విధకందము.

తరతర మవర్గ మాదిగ, దొరలించిన మాలికాచ•తుర్విధకందం
బరుదారును సత్కృతులం, దురగాధిపనన్యతల్ప • యుదధిశయానా. 417

క. శ్రీభూమీన వరద హరి, గోభూమానవవినుత సు•గుణబుధ మధునా
శా భీమా నవకృష్ణఘనాభా మానవహరి దరి • యభవకమలనా. 418

గర్భద్వితీయకందము.

భూమీన వరదహరి గో, భూమానవవినుత సుగుణ ♦ బుధ మధునాశా
భీమా నవకృష్ణఘనా, భామానవహరి దరి యభ♦వకమలనా శ్రీ. 419

గర్భతృతీయకందము.

మీనవరద హరిగోభూ, మానవవినుత సుగుణబుధ ♦ మధునాశా భీ
మా నవకృష్ణఘనా భా, మానవహరిదరియభవక♦మలనా శ్రీభూ. 420

గర్భచతుర్థకందము.

నవరద హరిగోభూమా, నవవినుత సుగుణబుధమధు♦నాశా భీమా
నవకృష్ణఘనాభామా, నవహరిదరియభవకమల♦నాశ్రీభూమీ. 421

అష్టవిధకందము.

రెండేసిగణంబులపై, నుండినగణ మాది గాఁగ ♦ నొనరఁగఁ జదువన్
ఖండితసౌంభకఘోటకి, తాండజ యష్టవిధకంద ♦ మనఁగాఁ బరఁగున్. 422

ప్రథమకందము.

తన కిరుగెలనను కనలుచుఁ, గొన బయి గిలిపెడుకనుగొలు♦కులఁ దగుఁ బెలుచ
న్ఘనులను గలయం బెనఁకువఁ, గనుచుం గలుములఁ దనిపెను ♦ ఖలశృంఖల పై. 423

ద్వితీయకందము.

కనలుచుఁ గొనబయి గిలిపెడు, కనుగొలుకులఁ దగుఁ బెలుచను ♦ ఘనులను గలయం
బెనఁకువఁ గనుచుం గలుములఁ, దనిపెను ఖలశృంఖల మయి ♦ తన కిరుగెలనన్.

తృతీయకందము.

గిలిపెడుకనుగొలుకులఁ దగుఁ, బెలుచ న్ఘనులను గలయను ♦ బెనఁకువఁ గనుచున్
గలుములఁ దనిపెను ఖలశృం, ఖల మయి తన కిరుగెలనను ♦ గనలుచుఁ గొన బై.

చతుర్థకందము.

కులదగుబెలుచ న్ఘనులను, గలయం బెనఁకువఁ గనుచును ♦ గలుములఁ దనిపెన్
ఖలశృంఖలమయి తనకిరు, గెలనను గనలుచు గొనబయి ♦ గిలిపెడుకనుకొల్. 426

పంచమకందము.

ఘనులను గలయం బెనఁకువఁ, గనుచుం గలుములఁ దనిపెను ♦ ఖలశృంఖల మై
తన కిరుగెలనను గనలుచుఁ, గొన బయి గిలిపెడు కనుకొలు♦కులఁ దగుఁ బెలుచన్.

షష్ఠకందము.

పెనఁకువఁ గనుచుఁ గలఁముల౯, దనిపెను ఖలశృంఖల మయి ♦ తన కిరుగేలన౯
గనలుచుఁ గొనబయి గిలిపెడుకనుగొలుకులఁ దగుఁ దెలుచను♦ఘనులనుగలయ౯.

సప్తమకందము.

కలుములఁ దనిపెను ఖలశృంఖల మయి తన కిరుగేలనను ♦ గనలుచుఁ గొన బై
గిలిపెడుకనుకొలుకులఁ దగుఁ, దెలుచ ఘనులను గలయును ♦ పెనఁకువఁ గనుచు౯.

అష్టమకందము.

ఖలశృంఖల మయి తన కిరు, గేలనను గనలుచుఁ గొన బయి ♦ గిలిపెడుకనుగొ
లుకులఁ దగుఁ దెలుచ ఘనులను, గలయుం బెనఁకువఁగనుచును♦గలుములఁదనిపె౯.

కందద్వయనీలోత్పలమాలామణిగణనికరగర్భసరసిజవృత్తము.

శ్రీవర్ధిష్ణుం బావనజీవు ♦ న్జితభృగుతనయుని ♦ సిరి గలుగుటకై
భావింతు న్సంభావితభావుం ♦ బ్రతియుగసముదిత♦బహుతనుమహితు౯
దేవేంద్రాదిప్రస్తుతదేవు ♦ న్దితితనయతుహిన♦దినకరకిరణు౯
ధీవిద్యాద్యోతు న్వాసుదేవు ♦ న్ధృతిమదగుణయుతుఁ ♦ దృణితవిదురదున్. 481

గర్భప్రథమకందము.

శ్రీవర్ధిష్ణుం బావన, జీవు న్జితభృగుతనయుని ♦ సిరి గలుగుటకై
భావింతు న్సంభావిత, భావుం బ్రతియుగసముదిత♦బహుతనుమహితున్. 482

గర్భద్వితీయకందము.

దేవేంద్రాదిప్రస్తుత, దేవు న్దితితనయతుహిన♦దినకరకిరణు౯
ధీవిద్యాద్యోతు న్వాసు, దేవు న్ధృతిమదగుణయుతుఁ ♦ దృణితవిదురదున్. 483

గర్భనీలోత్పలమాల.

శ్రీవర్ధిష్ణుం బావనజీవు౯ ♦ భావింతు న్సంభావితభావు౯
దేవేంద్రాదిప్రస్తుతదేవు౯ ♦ ధీవిద్యాద్యోతు న్వాసుదేవున్. 484

గర్భమణిగణనికరము.

జితభృగుతనయుని ♦ సిరిగలుగుటకై, ప్రతియుగసముదిత♦బహుతనుమహితు౯
దితితనయతుహిన♦దినకరకిరణు౯, ధృతిమదగుణయుతుఁ ♦ దృణితవిదురదున్. 485

వాణీపద్మాంబారతిదరధ్వనితాళమధురగతిగర్భోత్పలమాలికావృత్తము.
శారదశాసితప్రసవ ♦ చాపవిఖండన సామసన్నుతా
తారణదాసపోషధవ ♦ తాపసమండన ధర్మతత్పరా
వారణభాసురప్రభవ ♦ ప్రాపకభండన వాసవానుజా
పారదవాసుదేవభవ ♦ పాపవిదండన భర్గపూజితా. 436

గర్భవాణీవృత్తము.

శాసితప్రసవ ♦ చాపఖండనా ♦ సామసన్నుతా
దాసపోషధవ ♦ తాపసమండన ♦ ధర్మతత్పరా
భాసురప్రభవ ♦ ప్రాపకభండన ♦ వాసవానుజా
వాసుదేవభవ ♦ పాపవిదండన ♦ భర్గపూజితా. 437

గర్భపద్మావృత్తము.

సవచాపవిఖండన ♦ సామసన్నుతా, ధవతాపసమండన ♦ ధర్మతత్పరా
భవప్రాపకభండన ♦ వాసవానుజా, భవపాపవిదండన ♦ భర్గపూజితా. 438

గర్భాంబావృత్తము.

చాపవిఖండన ♦ సామసన్నుతా, తాపసమండన ♦ ధర్మతత్పరా
ప్రాపకభండన ♦ వాసవానుజా, పాపవిదండన ♦ భర్గపూజితా. 439

గర్భరతీవృత్తము.

ఖండనసామసన్నుతా, మండనధర్మతత్పరా
భండనవాసవానుజా, దండన భర్గపూజితా. 440

గర్భదరధ్వనితాళము.

శాసితప్రసవ ♦ దాసపోషధవ
భాసురప్రభవ ♦ వాసుదేవభవ. 441

గర్భమధురగతిరగడ.

శాసితప్రసవ ♦ చాపవిఖండన, దాసపోషధవ ♦ తాపసమండన
భాసురప్రభవ ♦ ప్రాపకభండన, వాసుదేవభవ ♦ పాపవిదండన. 442

ఆశ్వాసాంతగద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర కామెపల్లిపురమందిరనందనందనచరణా రవిందవందనాభిలాష మనీషాప్రాభవవేంగళార్యతనూభవవిద్యావిశేషసురాచార్య కాకునూర్యప్పకవివర్యవిరచితం బైనయాంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణశాస్త్రం

బునందు మూలసూత్రంబులును, ఛందఃప్రభావంబును, ఛందోవ్యాపక[1]సంప్రదాయంబును, ఛందస్స్వరూపంబును, నితిహాసాదిస్వరూపంబును, గద్యవచనంబులును, ప్రథమప్రత్యయోద్ధారణక్రమంబును, గణజననచ్ఛందంబులును, గురులఘువర్ణనిర్ణయంబును, సర్వగణలక్ష్యంబులును, గణాధిదేవతాఫలంబులును, అష్టగణలక్ష్యంబులును, దేవతానరాంకితనియమంబులును, నాయకగణకూటంబులును, గృత్యాదిగణద్వయకూటంబులును, ప్రశస్తకూటంబులును, దోషాదోషబాహుళ్యఫలంబులును, గణద్వయయోగఫలంబులును, గణనాదయోగఫలంబులును, షట్ప్రత్యయంబులును, బద్యలక్ష్యోపయోగిసంజ్ఞలును, షడ్వింశతిచ్ఛందోజాతసమవృత్తంబులును, ముఖ్యగౌణవృత్తంబులును, మాలికావృత్తవివేకంబును, జాత్యుపజాతులును, చిత్రబంధగర్భకవిత్వంబును గలచతుర్థాశ్వాసము సంపూర్ణము.



1 సాంప్రదాయకంబును (ప).

# పంచమాశ్వాసము.



కృష్ణాపూర్వతట
ప్రాకారప్రాంతకుతల•పరిశోభితవి
ద్యాకరకేతవరనగర
నాకారివిధిత్రినేత్ర•సన్నుతభవనా. 1

క. అవధారు శబ్దశాసను, డవనిం గలియుగమున కాది • నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పినయం, ధ్రవచోవ్యాకరణసూత్ర•తతిఁ దెనుఁగింతున్. 2

ఆ. ఆంధ్రసంధు లెల్ల • నష్టాదశార్యల, సుకవు లౌ నటంచుఁ • జోద్య మంద
ఛత్రితాద్రినాథ • శబ్దానుశాసనుఁ, డవనిఁ దేటపఱిచె • నతిముదమున. 3

## సంధిపరిచ్ఛేదము.

మూ. సూ. తిఙ్మధ్యశేషషష్ఠీసుస్కర్మప్రవచనీయజవిభక్తిః,
కిఙ్చిత్ప్రిశంసనాద్భుతసన్తాపముదాత్తదాకిమేవాం శ్చ. 1
త్వాకిలతూష్ణీమాద్యా నభిదధతికలా ద్రుతో న యేషాం స్యాత్,
అన్యే ద్రుతప్రకృతయో యే స్యు ర్హ్యనుజీవితద్రుతా నిత్యమ్. 2
సర్వ త్రాజ్వ త్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః,
లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు. 3
సన్ధి ర్నాచో చ్యనుతో వాతో నాదిషు విభక్తి షూతో వా,
నిత్య మనుత్తమపురుషక్రియా స్వితరే పరిమితౌ సమస్తనామ్. 4
న స్యా త్తద్ధర్మోత శ్చే ర్వాస్యా ద్వర్తమానవిహితస్య,
తద్వత్తదాదిజస్య ప్రాయ స్తు స్యా త్కిమాదిక స్యైతః. 5
అపిశబ్దేతో లు గ్వా స్యా దిచ్ఛ విభక్త్యన్తిమస్య జే రలిచ,
శబ్దా త్తచ్ఛబ్దాతో లు గ్దారార్థే త ఉదపి రేఫ స్స్యాత్. 6
సామానాధికరణ్యే షూదన్తానాం టుగాగమో చి స్యాత్,

తే. హేమచంద్రత్రివిక్రమ♦నాము లాదిఁ
బ్రాకృతము ద్రోవఁ జూపి రా♦ప్రాకృతంబు
నందు భేదంబుగావున ♦ నాంధ్రమునకుఁ
గలుగులక్షణ మెఱుఁగఁగ ♦ వలయుఁ గవులు. 5

ఆ. తెలుఁగుబాస యెంత ♦ దెలిసి యుండిన దీనిఁ, జదువకున్నఁ గవిత ♦ చక్కఁగాదు
ఇంటిలోన హేమ ♦ మెంత గల్గిన నేమి, తొడవు సేయ కున్నఁ ♦ దొడుగ రాదు.

క. పదసంధులఁ జెడ నడికినఁ, బదపద్యము లార్యసభలఁ ♦ బరువడి హాస్యా
స్పదము లగుఁ గాన వైకృత, పదసంధివిధములు తేట♦పఱిచెద వరుసన్. 7

క. [1]వసుధ విసంధియును మహా, విసంధియుఁ గుసంధిదోష♦విధమును దుస్సం
ధిసమాఖ్యయు ననునాల్గును, బొసఁగింపరు సంధిదోష♦ము లటంచుఁ గవుల్. 8

తే. హరి ముసలికిని అనుజుండు ♦ అర్జునునకుఁ
జెలి యనుచు నిట్లు గుడుసుపై ♦ శృంగముపయి
స్వరములకు సంధి గలుగక ♦ సాగకేని
దానిని విసంధి యండ్రు స♦త్కవులు కృష్ణ. 9

తే. సాల్వభూమివరు న్నండ♦జధ్వజుండు
ధరణిఁ గూల్చె సురల్ యద్భు♦తంబు నొంద
ననుచుఁ బొల్లులవలపల ♦ నచ్చు లున్న
జరుగును మహావిసంధిదో♦షం బనంగ. 10

తే. మగువొకతె సారెతెలనాకు♦మడుపు లీయఁ
బొలఁతొకతె తెల్లసవరంబు ♦ బూని విసరఁ
జేడొకతె చక్రితో నెత్త♦మాడె ననఁ గు
సంధి యగు నిట్లు గలయని♦సంధు లదుక. 11

క. ఎందును దుస్సంధిసమా,ఖ్యం దిర మగు నందు నిందు ♦ ననుచో నందు
న్నిందు న్ననిపై నచ్చులు, పొంద సముచ్చయనకార♦ములు కృతి నూఁదన్. 12

తే. తొలుత నీసంధిదోషచ♦తుష్టయంబు, చెంద,కుండఁగఁ గావ్యము♦చెప్పవలయుఁ
గానఁ దెలియంగ సంధిల♦క్షణము లెల్ల, విన్నవించెద గోపాల ♦ విమలశీల. 13

క. పుడుములు ప్రథమైకోక్తికిఁ, గడఁ గూర్చిన యది విభక్తి♦కం బనఁబడుఁ బా
ల్పడి యవి చెందనినుడు గ్రొ,ప్పుడు నవిభక్తికము నామ♦మున ననఁబరఁగున్. 14

---

1 ఎసఁగ (పూ. ము).

క. తరు వనఁ హారుఁ డనఁ బుర మనఁ, బరగ నివి విభక్తికములు ♦ బహువు[1]పురుడు సుం
దరి దుర మనునివి యెల్లను, నరసఖ యవిభక్తికములు ♦ నామములు నగుఁగా. 15

ఆ. [2]వెనుక నున్నపదము ♦ కొనయక్షరంబుతోఁ, బైపదంబుమొదలి ♦ ప్రాణమునకు
నూత్రమైనను సంధి♦చొప్పడకున్న నప్పట్లు బుధులు ప్రకృతి♦భావ మండ్రు. 16

క. తొలఁగి చనుఁ దొలఁగ కుండును, గలుగును లే కుండు నొకటఁ ♦ గా కుండును ని
చ్చలు వచ్చును రాకుండును, జెలువార వికల్ప మనుచుఁ ♦ జెప్పెడుచోటన్. 17

క. మొదలను జెప్పినవిధమున, కొదవు వికల్పంబు లేక ♦ యొక్కట తెలుఁగునన్
బదపడి నిలిచినదానిని, యదుగోత్రపవిత్ర నిత్య ♦ మందురు ధీరుల్. 18

తే. పుడమిఁ దొల్లింటిరాజుల ♦ వెడల నొత్తి, వారిసెళవులఁ దా మొందు♦వైరినృపుల
పదిమును పున్నవ్రాలను ♦ బాఱఁ దోలి, తా మచట నిల్చు నాదేశ♦నామకములు.

తే. వెండికొండను నెలకొన్న ♦ వేల్పుజేని, చెంత నత్యంతమైత్రిమైఁ ♦ జేరి యుండు
యత్తుగతి శబ్దమునఁ గల్గు♦నక్షరంబు, పొంత నుక్త్యాగమము పొందఁ ♦ బూనినిల్చు.

తే. పదములను మున్ను గలవ్రాల♦ తుదినిదామ్మ,నతికికొనినిల్చులిపులు ప్ర♦త్యయము లయ్యె
మున్నుపదములఁ గలవర్ణ♦ములునిలు పక, తొలఁగి చనుట లోపం బని♦పలుకఁబడును.

## ద్రుతప్రకృతికసంజ్ఞ.

మూ. సూ. తిఙ్మధ్యశేషవష్ఠీసుస్కర్మప్రవచనీయజవిభక్తిః,
కిఞ్చిత్ప్రిశంసనాద్భుతసన్తాపయదాతదాకిమేవాశ్చ.
క్త్వాకిలతూష్ణీమాద్యాః నభిదధతి కలాం ద్రుతోన యేషాం స్యాత్,
అన్యే ద్రుతప్రకృతయో యే స్యుర్హ్యనుజీవితద్రుతా నిత్యమ్.1

క. వలసినచోఁ దుది ద్రుతములు, తలచూపెడుశబ్దములు ద్రు♦తప్రకృతు లనన్
వెలయు నవి వొడమ కుండెడు, తెలుఁగుపదంబులు కళాప్ర♦దేశము లయ్యెన్. 22

తే. ధాత ధాతను భూపతి ♦ ధరణిపతిని
జనకు జనకుని గనియెఁ గ♦న్గొనియె ననుచుఁ
గడ ద్రుతము లిట్లు లోపము ♦ ల్గాంచి వలయు
పట్లఁ గనుపట్టునవి ద్రుత♦ప్రకృతు లీశ. 23

క. వికృతిపదంబులలోపల, నకారములు వలయుచోఁ గొ♦నలఁ బొడమ ద్రుత
ప్రకృతు లసంఖ్యంబులు గొం,కక యవి యెన్నంగ నలవి♦గా దహిపతికిన్. 24

---

1 పురుఁడు (ఓ.). 2 వెనక (ప. ఓ.).

